# మీరెవరి మదినైనా కలవర పెట్టాలనుకున్నప్పుడు

## అమాయకత్వం చిందించే బొట్టు పెట్టుకోండి.

మీ కనురెప్పలలో తత్తరపాటు,
నడకలో వయ్యారంతోపాటు
నొసట శింగార్ కుమ్‌కుమ్ బొట్టు
పెట్టుకు చూడండి.
శింగార్ రంగులలోని
అత్యుత్తమ పదార్థాలతో
తయారైంది, మీ హావభావాలకు
సరితూగేలా...మీ బట్టల
అందాన్ని మరింత చేసేలా.



**శింగార్**

**కుమ్ కుమ్ బొట్టు**
**—భారతదేశపు**
**అత్యంత అందమైన**
**సౌందర్య తిలకం**




everest/80/SH/76/tl



## ము ఖ చి త్రం

ఆంధ్రసచిత్ర వారపత్రిక 16 5 80 సంచిక దీప ముఖచిత్రంవేయడం మమ్మెల్నెంతో ఆకర్షించింది కాంచనగంగ, స్వయంవరం సీరియల్ కథలు చాలా బాగున్నాయి ఈ వారం మధ్య పేజీలో వేసిన కలర్ పోటో గీత చాలా బాగుంది మీ [మా] పత్రికకు చాలా ఆకర్షణీయంగా ఉంది కార్టూన్లు బాగున్నాయి

అంతర్వేది నాగేశ్వరరావు, శ్రీదేవి, శశి, నాగమణి, శ్రీలక్ష్మి [పాలకొల్లు]

* * *

దీపముఖచిత్రంతో వెలువడిన 16 5 80 ఆంధ్రసచిత్ర వారపత్రిక మనోరంజకముగా ఉంది 'కాంచనగంగ' సీరియల్ ముక్తసరిగ నడుస్తోంది 'స్వయంవరం' ముగింపు చాలబాగుంది 'షాక్ ట్రీట్‌మెంట్' కథ మధ్య రకముగా ఉంది మధ్య పేజీలో వేసిన నటి గీత కలర్ పోటో పత్రికకు హైలైట్

కొడాలి వెంకటేశ్వరరావు [ముదినేపల్లి]

## క థ లు

'అత్త ఒకింటి కోడలే' నేటి సమాజానికి చాలా దగ్గరగా ఉండి మా హృదయాలను ఆకట్టుకొంది కాపలా కథ చిన్నదైనా బాగుంది

ధర్మపథం ద్వారా చాలా మంచి విషయాలను తెల్సుకో గలుగుతున్నాము

ఎన్నో తాజా సినిమా వార్తలు ప్రతివారం చక్కగా తెలియజేస్తున్నందుకు కృతజ్ఞతలు

ఈ వారం ప్రచురించిన అన్ని కార్టూన్స్ కడుపుబ్బ నవ్వించాయి ఒకటి మాత్రం ఏమీ బాగోలేదు

కె ఉపేందర్‌రెడ్డి, పోలిసెట్టి లక్ష్మి, పుల్లి కొర్బన్, చెన్నయ్య, అడివప్ప, మానెప్ప [జనగామ]

* * *

మేము ఆంధ్రసచిత్ర వారపత్రికను మూడేళ్ల నుండి క్రమం తప్పకుండా చదువుతున్నాము ఉత్తరాలశీర్షికలో మొట్టమొదటిసారిగా పాల్గొంటున్నాం 16 5 80వ తేదీ పత్రికలో "షాక్ ట్రీట్ మెంట్" "పురుషుడి పురిటి నొప్పులు" కథలు చాలా బావున్నాయి సీరియల్స్ "కాంచనగంగ" చాలా బాగుంది "స్వయంవరం" చాలారసవత్తరంగా ముందుకు సాగుతోంది దీప ముఖ చిత్రం పత్రికకు ఎంతో అందాన్నిచ్చింది మూమెన్‌గారి "లోకంపోకడ" చాలా బావుంటోంది కె రామలక్ష్మిగారి "ప్రశ్నావళి" మమ్మల్ని బాగా ఆకర్షించింది ఈ వారం కర్టూన్స్ కడుపుబ్బ నవ్వించాయి

పి షీలా, శ్యామ్, శ్రీనాథ్, ద్వారకనాథ్, [ఆదోని]





# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 – 1972]

శుక్రవారం : 30-5-'80
రౌద్రినామ సం. అధిక జ్యేష్ఠ బ. పాడ్యమి
సంపుటము 73 : సంచిక 40

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 49-40
ఆరు మాసాల చందా రు. 24-70
విడి ప్రతి వెల 90 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
నటి మధుమాలిని
[ఫొటో : ఎస్. ఆర్. డి. మూర్తి]

# ఫాలాక్షుని డైరి

## అనాచారం!

బంగ్లా దేశంలో ఓ వింతాచారం ఉందట. ఏ స్త్రీ అయినా మానభంగం చేయబడితే ఆమెకు తల నున్నగా గొరిగిస్తారట. అసలే తన మీద జరిగిన యీ అత్యాచారానికి బాధపడే స్త్రీ యీ అనాచారాన్ని కూడా ఒప్పుకోవాలన్నమాట!

## రైలు ప్రమాదం!

19వ తేదీ పగలు విల్లుపురం నుంచి బయలుదేరి తిరువన్నామలైకు పోతూన్న ప్యాసింజరు రైలు తిరువన్నామలై యింకా మూడు మైళ్ల దూరంలో ఉన్నదనగా తండరై, వేళునందల్ రైల్వే స్టేషనుల మధ్యనున్న ఓ బ్రిడ్జి దాటుతూ గతి తప్పిందట. ఇంజను, రెండు పెట్టెలు, బ్రిడ్జి దాటాయట. ఒక పెట్టె రెండు ముక్కలై ఒక ముక్క బ్రిడ్జి మీంచి వ్రేలాడుతూ ఉండి, రెండో ముక్క, ఆ ముక్కతోపాటు మరో మూడు పెట్టెలూ క్రింది వాగులో పడిపోయాయట. ఇది మిట్ట మధ్యాహ్నం ఒకటిన్నరకు జరిగిందట. ఈ తుక్కు తుక్కయిపోయిన పెట్టెలనుంచి ఇప్పటికి 16 శవాలను బయటికి తీయగలిగారట. ఇంకా చాలా ఉండి ఉండొచ్చను కుంటున్నారట. సుమారు వంద మంది గాయాలతో తిరువన్నామలై ఆసుపత్రిలో చికిత్స పొందడానికి చేర్చబడ్డారట. ఇంత భయంకరమైన యీ సంభవానికి విద్రోహక చర్యేమయినా కారణంగా ఉండి ఉండవచ్చు అని ప్రభుత్వమనుమానిస్తోందట.

## అంతులేని లంచాలు!

రాజస్థాన్ కెనాల్ ప్రాజెక్టు అధికారులు తమకు వచ్చే మామూళ్లు, అడిగి తీసుకునే ఆమ్యామ్యాలూ కూడా చాలక, వాటితో సంతృప్తి చెందక, బియ్యం, అపర ధాన్యాలూ కూడా లంచంపట్టూ, వాటితో కూడా సంతృప్తిపడక విదేశాలనుంచి పేద పిల్లలకు ఉచితంగా యివ్వడానికి పంపబడిన పాల పొడరు కూడా స్వాహా చేస్తున్నారుట. ఈ విధంగా ఉచితంగా పంపకం చేయమని ఆ ప్రదేశానికి వచ్చిన సరకుల ధర యీ ఏటి వివరాలను బట్టి ఎనిమిది కోట్ల రూపాయలట. ఇవి ఏవీ జేరాల్సినవారికి జేరక, చిల్లర, గుత్త వ్యాపారుల షాపులలోకి వెళ్లిపోతున్నాయట.

## మానభంగాల్లో అగ్రస్థానం!

ఉత్తరప్రదేశ్ జనాభా విషయంలోనే గాక, మానభంగం కేసులలో కూడా భారత దేశంలోని రాష్ట్రాలలో ప్రథమస్థానం అలంకరిస్తోందట. ఇక్కడ మానభంగాలలో చాలా భాగమసలు కేసులుగా రూపొందవనీ, అలా రూపొందేవి కనీసం నెలకు అరవై నుంచి డెబ్బయి వరకూ ఉంటాయని అంచనాలట. జనవరి నెల, ఫిబ్రవరిలో సగం గడిచే సరికి మానభంగం కేసులు 149 నమోదు అయ్యాయట. 1977లో 713 మానభంగం కేసులు నమోదయ్యాయనీ, 1978లో 784, 1979లో 679 లెక్కలకు వచ్చాయనీ తేలింది. ఈ మానభంగం కేసులు మానానికి భయపడి పోలీసుల వరకూ చాలా రావనీ, వచ్చినవే యిన్ని ఉంటే యింకా రాకుండా ఉన్నవెన్ని ఉంటాయో వూహాతీతమనీ కూడా యీ లెక్కలు తేల్చిన వారన్నారట!

## కాపీలందిస్తే గుండు!

మహారాష్ట్రకు చెందిన 'ఎరిన్ డోల్' అనే వూరిలో ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలు జరుగుతుండగా అందులోని తమ స్నేహితులకు సహాయపడడానికో అయిదుగురు విద్యార్థులు చిన్న చిన్న కాగితాల మీద సమాధనాలు వ్రాసి కాపీ కొట్టమని అందిస్తూండగా, పోలీసులు వారిని పట్టుకుని నేరుగా క్షౌరశాలకు తీసుకువెళ్లి ఆ అయిదుగురికి నున్నగా గుండు గీయించి వదిలేశారట. ఇలా గుండు చేయడం వల్ల విద్యార్థులు తిరిగి యీ పని చేయ భయపడ్తారని పోలీసుల వూహట!

## ఇందిరాగాంధీపై హత్యాప్రయత్నం!

14వ తేదీ సోమవారం ఉదయం ఢిల్లీలో స్వర్గీయ అంబేద్కర్ 89వ జన్మదినోత్సవ సందర్భంగా ఆయనశిలావిగ్రహానికి పూలమాలలు వేసి తన కారువైపు వెళ్తున్న ప్రధాని ఇందిరా గాంధీ మీద రామ్ బాల్ చంద్ లాల్వానీ అనే 25 ఏళ్ల యువకుడు ఆరు అంగుళాలు పొడవున్న బాకు సర్రున విసిరాడట. అది చూసిన పోలీసు ఇన్‌స్పెక్టరు మురారిలాల్ మెరుపులా ఆకత్తికి, ఇందిరా గాంధీకి అడ్డురావటంతో అది ఆయనకు తగిలి, చిన్న గాయం చేసి ఇందిరాగాంధీ ముందు పడ్డదట. తృటిలో కానిస్టేబుల్ టీకారామ్ కొంతమంది సెక్యూరిటీ బలగంతో అతన్ని పట్టేసి రెప్పపాటు కాలంలో పార్లమెంటరీ వాచ్ అండ్ వార్డ్ రూముకు మోసుకుపోయారుట. ఆవిడచుట్టూ ఉన్న సెక్యూరిటీ వల్లనే ఆవిడ ప్రాణాలకు ముప్పు వాటిల్లలేదనీ, ఏ మాత్రం జనం తక్కువ ఉండి ఉన్నా అనుకోకూడనిది జరిగిండేదనీ, ఆ సంఘటన చూసినాయన అన్నారట. లాల్వానీ అన్నగారు గుజరాత్ పి.డబ్ల్యు.డి.లో డిప్యూటీ ఇంజనీరుట. ఆయనకూ బరోడా డైనమైటుకూ సంబంధం ఉన్నదట. లాల్వానీ జేబులో నాలుగొందల రూపాయలు, ఢిల్లీ నుంచి వెళ్లిపోవడానికో రైలుటిక్కట్టూ ఉన్నాయట. లాల్వానీ ఆరోజు ఉదయమే ఢిల్లీ వచ్చాడట. అతను బరోడాకు 10 కిలోమీటర్ల దూరంలో ఉన్న జవహర్ నగర్‌లో ఓ ఫాలిస్టర్ ఫైబర్ ఫ్యాక్టరీలో ఫిట్టరుగా పని చేస్తున్నాడట. ఈ హత్యా ప్రయత్నానికి బరోడా డైనమైట్ కేసుకూ ఏదైనా సంబంధం ఉందా అని విజ్ఞులు అనుమానిస్తూ ఏది ఏమైనా బరోడా డైనమైటు కేసు, తిరిగి త్రవ్వబడుతుందనుకుంటున్నారట.

## ఎక్కువవుతున్న ఎడమచేతి వాటం!

ఆ ఏటికాఏటికి ఎడమ చేత్తో రాసే వారి సంఖ్య ప్రపంచంలో పెరిగి పోతోందట. 35 ఏళ్ల క్రితం రెండు నుంచి నాలుగు శాతం మాత్రమే యీ ఎడమ చేత్తో రాసేవారుండే వారుట. ఇప్పుడు ఎనిమిది నుంచి పది శాతానికి వీరి బలం పెరిగిందట. అనగా ప్రతి నూరు మందిలో కనీసం ఎనిమిదుగురు ఎడమ చేత్తో వ్రాసే వారుంటున్నారన్నమాట! ఉంటే ఏం?



సీరియల్

# తపోవనగంగ

సుధాగౌతమ్

జరిగిన కథ - 8: ‘గులాబీకి ముళ్ళుందు కుంటాయి’ అన్న సమస్యను డాక్టర్ నీలిమ, సిస్టర్స్ దీనా, ఫాతిమాలతో అపర్ణ చర్చిస్తుండగా, అబార్షన్ అయిన ఒకామెను ఆమె తల్లి అక్కడకు తీసుకువస్తుంది. కట్నం బాకీపడ్డ కారణంగా ఆమెభర్త తంతే ఈ విధంగా జరిగిందని చెబుతుంది. ఆమెను ఆపరేషన్ చేసి కాపాడిన అపర్ణ ఆలోచనలు గతంలోకి పరిగెడుతాయి. తాలూకా గుమాస్తా పరంధామయ్య, విశాలాక్షిలకు అపర్ణ, రవి, రజని సంతానం. అన్నింటిలోను ముందుండే అపర్ణను ఉన్నపొలం అమ్మి మెడిసిన్‌లో చేర్పిస్తాడు పరంధామయ్య. అనుకోని విధంగా పరిచయమైన డాక్టర్ శ్రీధర్, అపర్ణ మనస్సులో చోటు చేసుకుంటాడు. అపర్ణ ఆశయాలను, బాధ్యతలను స్వీకరించి, పెండ్లి చేసుకొంటానని ఆమెతో చెప్తాడు శ్రీధర్. శ్రీధర్, అపర్ణల పెళ్ళి అయిన అనంతరం పరంధామయ్య మరణిస్తాడు. ఆ తరువాత శ్రీధర్‌లో వచ్చిన మార్పును చూసి సహించలేక పోతుంది అపర్ణ. శ్రీధర్‌తో తెగతెంపులు చేసుకొని, తన వాళ్ళని తీసుకొని వెళ్ళిపోయిన అపర్ణ మీరా సహాయంతో ‘పెద్దసర్జన్’ అవుతుంది. ఆమెకు కొడుకు పుడతాడు. తన ఆదర్శాలకు అనుగుణంగా, కానీ కట్నం తీసుకోకుండా రంగనాథం గారమ్మాయి రమతో రవి పెళ్ళి జరిపిస్తుంది అపర్ణ. ఏ ఆదర్శానికి అనుగుణంగా తన తమ్ముడి పెళ్ళి చేసిందో, అదే ఆదర్శంతో చెల్లెలు రజనికి పైసా కట్నం ఇవ్వకుండా వేణుతో పెళ్ళి జరిపిస్తుంది డా. అపర్ణ. గతంలోంచి బయట పడుతుంది అపర్ణ. ప్రాణాపాయంలో ఉన్న శ్రీధర్ రెండవ భార్య కవితకు ప్రాణభిక్ష పెడుతుంది.

*(గత సంచిక తరువాయి)*

శ్రీధర్‌తో తన జీవితం ఎప్పుడైతే ఇలా అయ్యిందో అప్పటినుంచి తనని ఎవరైనా పొగిడితే తనకు అసహ్యం.

శ్రీధర్ కూడా తనని అలాగే పొగిడేవాడు. వాటిని నమ్మి తను మోసపోయింది. పొగిడే వారు తన అక్కరకై పొగుడుతారు గానీ అవి నిజం కాదనీ, మనస్ఫూర్తిగా ఎవరూ, ఎవర్నీ పొగడరనీ అప్పట్నుంచి ఓ అభిప్రాయానికి వచ్చేసింది.

విషయం మార్చడానికని ప్రయత్నించింది

“మీ అమ్మాయికి ఎందుకిలా అయ్యింది. జనరల్ హాస్పిటల్‌కి వెళ్ళక. నేరు ఇక్కడికి వచ్చారే. సామాన్యంగా జనరల్ హాస్పిటల్లో ఉన్నన్ని పెద్ద పెద్ద ఆపరేషన్ పరికరాలు ఇక్కడ ఉండడం అరుదు. మా నర్సింగ్ హోం డాక్టర్లు ఎంత ఎఫిషియంట్స్ అయినా, ఒక్కొక్కప్పుడు సరియైన పరికరాలు లేనప్పుడు మా కేసుల్ని జనరల్ హాస్పిటల్‌కే పంపుతుంటాం.”

అపర్ణ తనగదివైపు పోతోంది. ఆమె మాట్లాడుతూనే డాక్టర్ని వెంబడించింది. “డాక్టర్ మా ఆయన హైదరాబాద్‌లో పెద్ద బిజినెస్ చేస్తుంటారు. మాలాగే అంత సంపాదన ఉన్నా, కవిత ఒక్కతే మా సంతానం...” ఆమె తన స్థూలమైన దేహంతో నడుస్తూ మాట్లాడానికి ఆయాసపడుతోంది.

“ఉస్మానియా ఆర్థోపెడిక్స్ హాస్పిటల్లో డిపార్ట్‌మెంట్లో మా అల్లుడు శ్రీధరరావు అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా ఉన్నాడిప్పుడు. భార్యను ఆయన విడిచేశాట్ట! పిల్లలూ లేరు!”

అపర్ణ మనస్సు కలుక్కుమంది. ఆ వేళకి తనకడుపులోని బాబుసంగతి జ్ఞాపకం రాలేదా శ్రీధర్‌కి. అతన్నేమనాలి? హృదయం లేనివాడు.

“మాకూ ఒక్కతే కూతురు డాక్టర్. అల్లుడు మా వద్దే ఉంటాడన్న ఆశతో రెండో సంబంధమైనా యిచ్చేశాం. అందుకే మా అల్లుడి అందాన్ని చూసి, అమ్మాయి అతణ్ణి తప్పితే పెళ్ళాడనని పట్టుపట్టింది.”

చిన్నగా నవ్వుకుంది అపర్ణ తనలోనే. ‘ఒకనాడు తనూ అలానే అనుకుంది మనసులో.’ శ్రీధర్‌ది అలా మనసులో ముంచేటి అందం. ఆ మత్తు మెదడునూ ఆలోచనల్ని కప్పేస్తుంది అలా.

తన గదిలోకి వచ్చి ఫాన్ ఆన్ చేసి, తన కుర్చీలో కూర్చుంది. ఆమెను కూడా కూర్చోమని మరో కుర్చీ చూపించింది.

ఆమె మెల్లగా కుర్చీలో కూర్చుంది.

“పెళ్ళై ఐదేళ్ళయినా పిల్లలు కలగలేదు కవితకి. అది అందరి హృదయాల్లోనూ వెలితిగా, తీరని బరువుగా ఉండేది. ఎనిమిదేళ్ళకి భగవంతుడు దయ తలిస్తే ఇలా అయ్యింది డాక్టర్” ఆమె గొంతు బొంగురుపోయింది.

“అమ్మాయి హైదరాబాద్‌లోనే ఉండిపోయి బేజారయ్యిందంటే, వాళ్ళ నాన్నగారు ఓ పదిరోజులు బెంగుళూర్ వెడితే బాగుంటుందని యిక్కడికి తీసుకొచ్చారు. మూడో నాటికే ట్రంక్ కాల్ వస్తే పని మీద వెళ్ళిపోయారు...” క్షణం ఆగిందామె ఊపిరి పీల్చుకోవడానికి.

“నాలుగు రోజుల్లో వచ్చేస్తానన్నారు. మేం హోటల్ ‘అశోకా’లో ఉంటున్నాం... కారు మాకే వదిలి, ప్లేన్‌లో వెళ్ళిపోయారాయన. ఇవ్వాళ ఉదయం పొద్దున్నే ‘లెరౌస్ గార్డెన్’ చూడ్డానికని పట్టుపట్టి వెళ్ళింది. నేనూ వెళ్ళాను డాక్టర్. తిరిగి వచ్చేటప్పుడు ‘లిఫ్ట్’ ఫెయిల్ అయ్యింది. నాకా క్షణానే భయం వేసింది డాక్టర్. ఐనా ఏంచేస్తాం? అరగంటయినా కరెంట్ రాలేదు. తప్పనిసరిగా మెట్లు దిగాల్సి వచ్చింది. నేను చేయూత యిచ్చి దింపుతున్నాను.” ఆమె యిక దుఃఖం ఆపుకోలేకపోయింది. “వెనకాల నుంచి దిగేవారి రద్దీ ఎక్కువగానే ఉంది. ఆ ఘడియ దాని పాలిటి విషఘడియ, అంతే! కాలు జారి యిరవై మెట్లు క్రిందికి దొర్లింది. నాకు ప్రపంచం గిర్రున తిరిగినట్టయింది. నాకు ఈ ఊరు కొత్త. తెలిసిన వారెవ్వరూ లేరు. ఆయనా లేరు అల్లుడు ఈ దేశంలోనే లేడు. నాకా







కాళ్ళూ, చేతులూ ఆడడం లేదు. ఆ సమయంలో జనరల్ హాస్పిటల్‌కు తీసుకుపోతే, ఆలస్యం కావచ్చనీ, పైగా రద్దీ ఎక్కువగా ఉంటుందనీ, ఈ ఊళ్లో మీరు చాలా పేరున్న మంచి డాక్టరనీ, అదీగాక హోటల్‌కి మీ నర్సింగ్ హోం దగ్గర్లో ఉందని, హోటల్ మేనేజర్ మమ్మల్ని యిక్కడ దిగబెట్టి వెళ్లాడు.' సమయానికి దేవుళ్లా ఆదుకున్నాడు డాక్టర్."

ఆమె యింకా ఏడుస్తూనే ఉంది. అపర్ణ ఆమెను సమాధాన పరచింది. సిస్టర్ దీవను పిలిచింది అపర్ణ.

"సిస్టర్. ఈమెకి నర్సింగ్ హోంలోనే ఓగది యివ్వాలి. డ్రయివర్ వస్తే కారియర్ అదీ తెప్పించే ఏర్పాట్లు చెయ్యాలి. తెలిసిందా?" అంటూ ఆమెవైపు తిరిగి "ఇక మీరు సిస్టర్ వెంట వెళ్లి, స్నానం చేసి, విశ్రాంతిగా రెస్టు తీసుకోండి.' యిక ఏ ప్రమాదమూ లేదు మీ అమ్మాయికి" అంటూ వెళ్లడానికి లేచింది.

"డాక్టర్, అమ్మాయికి మళ్లీ పిల్లలు కలుగుతారు కదండీ?"

ఆమె కంఠంలో ఏదో సందేహం ధ్వనిస్తోంది. అది తను మాత్రం ఖచ్చితంగా ఎలా చెప్పగలుగుతుంది? పిల్లలు కలగడానికెంత అవకాశం ఉందో, కలగకపోవడానికీ అంతే అవకాశం వుంది. అయితే తనిచ్చే జవాబుపైనే, ఆ మాతృ హృదయపు ఆశలూ, భవిష్యత్తులోని ఆశలూ అన్నీ ఆధారపడి ఉంటాయి.

ఆమెకి ఆ అమ్మాయి ఒక్కగా నొక్క బిడ్డ. నిజం చెప్పి, తను ఆమె లోకాన్ని నిరాశతో, నిస్పృహతో నింపలేదు. అబద్ధం చెబితే! కనీసం ఆ తల్లీ, బిడ్డలు ఆశల్లోనైనా, ఆశతోనైనా బ్రతక గల్గుతారు. కానైతే శ్రీధర్‌కి, కేస్ హిస్టరీ స్టడీ చేశాకన్నా నిజం తెలియక పోతుందా? ఏంత యినా డాక్టర్! అయినా తన హృదయం అబద్ధాన్నే చెప్పమంటోంది.

"మీకా అనుమానం ఎందుకొచ్చింది? మీ అమ్మాయికి తప్పకుండా పిల్లలు పుడతారు. కొన్ని నెలల రెస్ట్ అవసరం అంతే" ఆమెకి ముఖం చూపించకుండా చకచకా కారువైపు నడిచింది డాక్టర్ అపర్ణ.

* * *

తను కవితకి ఆపరేషన్ చేసి పదిరోజులు కావస్తోంది. కవిత సిస్టర్ దీవ సహాయం లేకుండానే నడుస్తోంది.

డాక్టర్ల దగ్గరికి వచ్చే అందరు పేషెంట్లకీ కవిత లాంటి మనోధైర్యం ఉంటే, ఆ డాక్టర్లకు పని ఎంత సులువౌతుంది!

నాలుగోరోజునే కవిత చేయూతతో నడవగలిగింది.

ఇప్పుడు కవిత ముఖంలో కళ చేరుకొంటోంది. ఆమెతో తనెక్కువగా మాట్లాడలేదు. మాట్లాడే సంధర్భమూ రాలేదు. తను రౌండ్స్ తీసుకునే వేళకి సెడేటివ్ ఎఫెక్ట్‌లో నిద్రపోయి ఉండేది. అలా కాకుంటే ఆమె జరిగిందాన్ని గూర్చి ఆలోచించి బాధపడే అవకాశాలున్నాయి. అప్పుడు ఆమె ఆరోగ్యం దెబ్బ తినవచ్చు. అందుకే, కవితకి అప్పుడప్పుడూ, కాంపోస్, లార్గాక్టిల్ లాంటివి, యిస్తూనే ఉంది తన అడ్వయిజ్ మేరకు సిస్టర్ దీనా.

కవిత తల్లి కూడా యిప్పుడు కాస్త కుదుటబడినట్టుంది. వాళ్ళ నాన్నగారు వచ్చి కూతురి విషయం విశదంగా తనతో మాట్లాడి వెళ్లారు.

ఎందుకో అతనితో మాట్లాడుతోంటే

తన తండ్రికి జ్ఞాపకం వచ్చారు. ఇంతకీ వారెవ్వరో, తనెవ్వరో తెలిపినవాళ్ళు లేదు. తెలిస్తే మాత్రం ఏం చేస్తారు? తను మాత్రం వారినేం చేస్తుంది? అంతా విధి చేతిలో కీలుబొమ్మలు

శ్రీధర్ కూడా వారం రోజుల్లో వస్తున్నట్టు కేబుల్ వచ్చినట్టు చెప్పారు కవిత తండ్రి నారాయణరావు.

అప్పట్నుంచి తనలో ఏవేవో ఆలోచనలు. 'శ్రీధర్ యిక్కడికి వస్తున్నాడు.' అలా అనుకుంటున్న ఆమెలో ఎలాంటి అనుభూతీ లేదు, స్పందనా లేదు. వస్తే అతణ్ణి నిలదీసే శక్తి తనకుంది. కానీ తనని చూసినప్పుడు, అతడిలో ఎలాంటి భావాలు కలుగుతాయి. తనని ఫేస్ చెయ్యగలడా? అతడిలో ఎలాంటి పరివర్తన ఉంటుంది. కవితకి తన విషయం చెబుతాడా? ఏమని చెబుతాడు?

కనీసం బాబు పుట్టాడన్న విషయమైనా అతడికి తెలుసా? ఆ విషయం ఒక్కసారైనా ఆలోచించి ఉంటాడా, ఈ పదేళ్ళలో? తను మాత్రం అతణ్ణి గూర్చి ఏం ఆలోచించింది. ఆలోచించాల్సిన అవసరం తనకు లేదు.

తను శ్రీధర్ నుంచి దూరం అయ్యాక కొన్ని రోజుల వరకూ మానసిక సంఘర్షణకు లోనైంది. తను ఆ సమయంలో కాబోయే తల్లి. అలాంటప్పుడు యోచించడంవల్ల తన ఆరోగ్యం, కడుపులోని బిడ్డ ఆరోగ్యం దెబ్బతినవచ్చు. డాక్టరుగా తనిలాంటి మనో వ్యాధికి బలి కాకూడదు. తన భవిష్యత్తు పుట్టబోయే బిడ్డపైనే ఆధారపడి ఉంది.

అందుకే గతాన్ని గురించి, శ్రీధర్ని గురించి ఆలోచించడం మానివేసింది. ఐదేళ్ళ తర్వాత, తను నర్సింగ్ హోం స్టార్ట్ చేసిన రెండేళ్ళ తర్వాత హైదరాబాద్లో, మెడికల్ కాన్ఫరెన్స్లో శ్రీధర్ని కలుసుకుంది.

అతడు తనను మాట్లాడించలేదు. తను కూడా అతనెవరో అన్నట్టు ప్రవర్తించింది, మనసులో అతడితో పాటు గడిపిన మధుర క్షణాలు జ్ఞాపకం వచ్చి మనసు బాధపడినా.

ఆడదాని అంతర్యమే అంత. తను ప్రేమించిన వాడు, తన భర్త ఎలాంటి వాడైనా, అతడితో ఆ బంధం ఆమెలో ఏనాటికీ మాసిపోదు. తనూ అంతే. శ్రీధర్ వ్యక్తిత్వాన్ని చాలా ఉన్నతంగా చిత్రించుకుంది మనసులో. ఆ చక్కటి అద్దాన్ని ముక్కముక్కలు చేశాడు. అంత ఉన్నతంగా ఊహించిన వ్యక్తిలో, ఇలాంటి చిన్నతనం ఉందే అన్న నిజాన్ని శాశ్వతంగా భరించలేకపోయింది తను.

అంతేకాకుండా, 'ఇలాంటి' మనిషికోసం ఆత్మవంచన చేసుకుని తన తండ్రి ఆశల్ని, తనని నమ్ముకున్న చెల్లెలి, తమ్ముడి భవిష్యత్తునూ నాశనం చేయడానికి తన మనసొప్పుకోలేదు. అలా చేసినా మనసుతో రాజీపడి ఆ మనిషితో బలవంతాన కాపురం చేసినా తన బ్రతుకు ఏమయ్యేది! రోజు రోజుకూ నరకం అయ్యేది. ఆ విడిపోవడం కాస్త ఆలస్యంగా జరిగేది.

భార్యా భర్తల్లో ఒకే పర మెంటల్ క్లాష్, కాంట్రాస్ట్ కలిగి ఉండిపోతే, అది భావి సంతానానికి కూడా హానికరమే!

అందుకే తను ధైర్యంచేసి వచ్చేసింది. ఆ కాన్ఫరెన్స్ లోనే తెలుసుకుంది శ్రీధర్ మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడని. అలా జరుగుతుందనీ తను ఏనాడో ఎక్స్పెక్ట్ చేసింది కనుక బాధపడలేదు. ఆ దురదృష్టవంతురాలెవరో అని బాధ పడింది కానీ, ఆ వార్త తనలో ఎలాంటి సంచలనాన్నీ కలిగించలేదు. మిగతా వివరాలు తనకక్కర లేదు కాబట్టి తను సేకరించలేదు. శ్రీధర్కి తనపై ఏటువంటి అనురాగంకానీ పుట్టబోయే బాబు గురించి ఉత్కంఠగానీ లేవనీ తనకు ఏనాడో తెలుసు. అదే ఉండి ఉంటే, ఏనాడో తనకోసం తహతహలాడేవాడు. ఎలాగైనా బాబు పుట్టాడన్న విషయం తెలుసుకొని, తనతో రాజీకి వచ్చి ఉండేవాడు. అలా వచ్చి వుంటే ఏం జరిగి ఉండేదో తనిప్పుడు చెప్పలేదు అతణ్ణి బాబు కోసమైనా క్షమించగల్గి, కనీసం 'కాంట్రాక్ట్' మాదిరి జీవితాన్ని గడిపేదేమో! అదీ మళ్ళీ తన చెల్లెలి పెళ్ళి, తమ్ముడి చదువూ, ఏ పాడి దొడుకులూ లేకుండా, తను అడ్డం రాకుండా ఉండే ఒప్పందం మీద. నిజంగా తను అలా చేసి వుండేదా? ఇప్పుడు శ్రీధర్ తనని రమ్మంటే పోతుందా?

సాధ్యంలేదు. ఇప్పుడు తన జీవితం అన్ని విధాలా స్థిరపడ్డది. తనను సంఘం ఏమనుకున్నాసరే, అతడు తన కిప్పుడు అక్కర్లేదు. భార్యంటే, కావల్సినప్పుడు రమ్మనడానికీ, వొద్దన్నప్పుడు విడిపోవడానికీ, డబ్బిచ్చి కొన్న కీలుబొమ్మ కాదు. నాటి నుంచీ నేటి వరకూ, ఏమగాడూ ఆడదాన్ని కొనలేదు. స్త్రీ విలువను తూచి, వెలకట్టి కొనేపాటి ధనం ఈ ప్రపంచంలో ఏమగాడి వద్దా లేదు. స్త్రీత్వానికి విలువ కట్టేవాడూ పుట్టలేదు. తర తరాల్నుంచీ ఆడదే మగవాణ్ణి మార్కెట్లోని 'కమాడిటీ' లా కొంటోంది. మగవాళ్ళు అమ్మాయికి రేట్ల వారీగా దొరుకుతున్నారు. కొనగలిగిన అమ్మాయి కళకళలాడుతూ కాపురం చేసుకుంటుంది. కొనలేని స్త్రీ సంఘం అంట గట్టిన అన్ని అవనిందల్నీ మోస్తూ వాడిన పూవులా రాలిపోతుంది.

## 'ఆర్టెక్' కు భారతీయ బాలలు

"మేను సోవియట్ యూనియన్కు అనధికారరాయబారిగా వెళుతున్నాము." అని మాస్టర్ అమిత్ సురేశ్చంద్ర జైన్ 13 సోవియట్ యూనియన్కు బయలుదేరి వెళ్ళే ముందు ఢిల్లీలో మే 5 న జరిగిన ఒక పత్రికా సమావేశంలో మాట్లాడుతూ చెప్పారు. బాలల చిత్ర లేఖనంలో సోవియట్ భూమి నెహ్రూ అవార్డు పొందిన బాలలు అమిత్ సురేశ్చంద్ర జైన్ 13, కుమారి భవ్యలాల్ 13, కుమారి మాధవి భట్ 13, మాస్టర్ పార్థ చౌధురీ 11, మాస్టర్ డి.వి. శివకుమార్ 13 ఒక నెల రోజుల పాటు ఆర్టెక్ యువ పయొనీర్ శిబిరంలో వేసవి శలవులు గడపడానికి బయలుదేరి వెళ్ళారు.

ఈ బాలలు ఆర్టెక్ శిబిరంలో వుండే కాలంలో ఒకరోజు భారత జాతీయ దినోత్సవం జరుపబడుతుంది. ఈ వేడుకలలో భారతీయ బాలలు తమ ఇతర దేశాల మిత్రులకు భారతీయ సాంస్కృతిక జీవితం గురించి తెలియజేసే సాంస్కృతిక ప్రదర్శనలను జరుపుతారు.

# అసలైన, సిసలైన

# గ్లాక్సోస్-డి*

## ఒక్కటె. దానిని తయారు చేయువారు గ్లాక్సో.




గ్లాక్సోస్–డి శుద్ధమైన గ్లూకోజ్ పౌడర్‌తోపాటు విటమిన్ డి–3, భాస్వరం, కాల్షియంలతో బలపరచబడిన నమ్మకమైన ఉత్పాదన. దేశములోని అత్యధిక ప్రజానీకం దీనిని తీసుకుంటారు. గ్లాక్సోస్–డి తక్షణమే శక్తిని ఇస్తుంది. గ్లాక్సోస్–డి రకరకాల ఆహార పదార్థములు, ప్రాణరక్షణకు వాడే ఔషధాలకు, మందులకూ పేరెన్నికగన్న గ్లాక్సో వారిచే తయారు చేయబడుతోంది.

చౌకబారు నకిలీ సరుకుల్ని కొని మోసపోకండి. అవి మీ కుటుంబం ఆరోగ్యానికి హానికరం కాగలవు.

మీరు కొనే గ్లాక్సోస్–డి ప్యాకెట్ అసలైనదే అని నిర్ధారణ చేసుకోండి.

* లైసెన్స్‌తో ట్రేడ్ మార్క్ వాడుతున్నవారు.

GFP. 5889-TL

## గ్లాక్సోస్-డి* –గ్లాక్సో వారి నమ్మకమైన గ్లూకోజ్ పౌడర్

# కాంచనగంగ

మూడు పువ్వులూ ఆరు కాయలుగా పండాల్సిన అమ్మాయిల జీవితం నాశనం కాకుండా ఉండాలంటే ఏం చెయ్యాలి ?

ఈనాటి యువతరంలో పరివర్తన కలగాలి.

యువకులు మానసికంగా ఎదగాలి.

'ఈనాటి తను రేపటి ఓ ఆడపిల్ల తండ్రి' అనే రియలైజేషన్ ప్రతి యువకుడిలోనూ రావాలి. ఏ విషయంలో కాకపోయినా వరకట్నాల విషయంలో నైనా యువకులు తలిదండ్రుల నెదిరించి ఒక నిస్సహాయురాలైన ఆడదానికి చేయూత నివ్వాలి. ప్రతికల వారి అబ్బాయీ ఓ పేద అమ్మాయినీ, ప్రతికల వారి అమ్మాయీ ఓ బీద యువకుణ్ణీ చేసుకోవడంవల్ల, దేశంలో ఎంతోమంది ఉద్ధరింప బడతారు. ఈనాటి యువతరం తలుచుకుంటే, ఈ వరకట్నాల పరిష్కరించడం పెద్ద సమస్యకాదు. ప్రతి అమ్మాయీ ఈ కట్నం వ్యవస్థని ప్రతిఘటిస్తే ఇంకా సులువుగా పరిష్కారం అవుతుంది.

గడియారం ఠంగుమని 'ఒకటి' కొట్టగా ఉలికిపడి ఊహల్లోంచి తేరుకుంది.

తన పిచ్చికి తనకే నవ్వొచ్చింది. తన ఊహలు ఎక్కణ్ణుంచి ఎక్కడికొచ్చాయి, ఒకదానితో ఒకటి సంబంధం లేనట్టు.

యింటికి పోవడానికి లేచింది అపర్ణ. ఆమె లేవడంచూసి డ్రయివర్ షెడ్లోంచి కారును బయటికి తీశాడు.

ఎక్కణ్ణుంచో వీచిన పిల్లగాలి ఆమెను చల్లగా తాకింది.

* * *

హాస్పిటల్ ముందు కారాగడం, అందులోంచి దిగిన శ్రీధర్ బోయ్ నడిచి ఆత్రంగా వడివడిగా నడుచుకుంటూ సిస్టర్ ఫాతిమా దారి చూపగా, కవిత ఉన్న స్పెషల్ రూంలోకి పోవడం తన గదిలోంచే చూసింది అపర్ణ.

అతణ్ణి చూసిన ఆ క్షణం గుండె ఎందుకో విచిత్రంగా, తీవ్రంగా కొట్టుకొంది.

అందుకనేనేమో! ఓ క్షణం రక్తం వేగంగా, వెచ్చగా ప్రవహించిందామెలో. తను శ్రీధర్‌ని చూసి పదేళ్ళవుతోంది. ఆ పదేళ్ళ కాలంలో తాను శ్రీధర్‌ని ఎన్నో క్షణాల్లో గుర్తు చేసుకుని ఉండవచ్చు కానీ అభిమానంతో గనీ, అనురాగంతో గనీ కాదు.

మరెందుకు ?

శ్రీధర్ తన కొడుకుకు తండ్రి ఆ రక్తపాశం ఏనాడూ ఉంటుంది. అది ఎన్నటికీ తెంచలేనిది.

తను బాబుకి ఏ విషయమూ అబద్ధం చెప్పలేదు. బాబుది నిజం చెప్పినా, అబద్ధాలు చెప్పినా నమ్మే వయసు. తొమ్మిదేళ్ళబాబుకి ఎంతో ఎదిగిన తను అబద్ధాలు చెప్పలేదు. అయినా తన బాబుని అబద్ధాల్లో పెంచడం యిష్టం లేదు తనకు.

వాడికర్థం కాకపోయినా, తను మీనాన్నతో పోట్లాడి వచ్చేశాననీ, మరి పోననీ, యిష్టమయితే నువ్వు పోవొచ్చనీ కూడా చెప్పింది తను ఎందుకు? బాబు పెద్దవాడై తననే అసహ్యించుకుని, తన తండ్రినిచూపమంటే, తను తండ్రివద్దే ఉంటానంటే, వద్దనడానికీ, కాదనడానికీ తనెవరు ?

ఈనాడైనా తన బాబు, తండ్రిని చూసి వెళతానంటే, తను కాదనదు. అలాంటి రోజు రావొచ్చనే, తను ఏనాటికైనా ఎదిరించాల్సి వస్తుందనే, బాబుతో క్లియర్‌గా నిజం చెబుతూ, తను ఈ పరిస్థితిని ఎదిరించడానికి సిద్ధమవుతూనే ఉంది.

మరి తనలో మాతృప్రేమ లేదా! తను స్త్రీ కాదా ? ఆ క్షణం ఎదిగిన కొడుకును చూసి, ప్రేమ పెల్లుబికినంత మాత్రాన, శ్రీధర్‌కి బాబంటే ఎనలేని ప్రేమ అని అనుకోవచ్చా ?

అయితే ఈ తొమ్మిదేళ్ళలో ఆ ప్రేమ ఎక్కడ పోయి వుంటుందని, తను అనుకోవాలి ?

తండ్రి ఈవేళ తన కొడుకు కావాలని తన హక్కుల్ని చెప్పినంత మాత్రాన, తండ్రీ కొడుకుల బంధం విడదీయకూడదని బాబు వెళతానన్నంత మాత్రాన తను గుండెదిటవు చేసుకుని మొండి ధైర్యంతో పంపినంత మాత్రాన, తనలో మాతృప్రేమ, వాత్సల్యం అంతరించి పోయాయనే అనుకోవాలా ?

తనలోని ఈ విచిత్రపు ఊహలకి నవ్వొచ్చిందామెకు.

ప్రక్కనే ఉన్న కిటికీలోంచి నేరుగా కవిత రూం కనబడుతోంది. మంచం పక్కగా ఛేర్‌లో కూర్చుని, కవిత తల

# కరకర కాకర

కావలసినవి :— అరకిలో కాకరకాయలు, నాలుగు ఉల్లిపాయలు, ఇంగువ, పసుపు, ఉప్పు, ఎండుమిరపకాయలు గరమ్‌మసాలా, దానిమ్మ గింజలు లేక మామిడి ముక్కలు, 70 గ్రాము బేసన్, నిండు ధనియాలు.

చేయవలసిన విధానం :— మెత్తటి కాకరకాయలను మధ్యగా కోసుకొని, వాటిలో ఉప్పు నింపి వుంచాలి. ఇంతలో గరమ్‌మసాలా తయారు చేసుకొని వుంచుకోవాలి. ఉల్లి, ఉప్పు, మిరప, గరమ్‌మసాలా, ధనియాలు, దానిమ్మ గింజలు లేక మామిడి ముక్కలు మెత్తగా నూరుకోవాలి తరువాత కళాయిలో బేసన్ వేసి దానిలో గరమ్‌మసాలా కలపాలి. ఇప్పుడు ఉప్పు పట్టించిన కాకర కాయలను బాగా కడగాలి. కడిగిన తరువాత వాటిలో పై మిశ్రమ మసాలాను నింపి, నెయ్యి లేక నూనెలో వేపాలి. వేపుతున్న సమయంలో కాకరకాయలను త్రిప్పుతూ పూర్తిగా వేగేటట్టు చూడాలి.

## కాకర వూరగాయ

కావలసినవి :- కాకర – కేజీ, ఆవ నూనె - 00 గ్రాములు, ఉప్పు పావు, ఎండుమిరప - 50 గ్రాములు, పసుపు, మెంతులు, సోపు, ఆవాలు–50 గ్రాములు.

చేయవలసిన విధానం :— చిన్న చిన్న కాకర కాయలను తొక్కతీసి పుచ్చుగాని వుంచుకోవాలి. పై సామాను అన్నిటిని బాగా ఏ తొక్కు లేకుండా శుభ్రం చేసి వేరు వేరుగా వేపాలి. తరువాత వాటిని ఎక్కువ వుండగా కాకుండా నూరాలి. ఇప్పుడు పై మసాలా అన్నిటిని కలిపి నూనెలో మరోసారి వేపాలి. ఉప్పు పట్టించిన కాకరకాయలను కడిగి నాలుగువైపుల నుండి కోసి, వీటిలో మసాలా మిశ్రమాన్ని పట్టించాలి. తరువాత వీటిని ఒక కుండలో వేసి నాలుగయిదు రోజులు ఎండలో పెట్టిన తదుపరి కుండ నూనెతో నింపాలి

— టి లీలావతి

ఆప్యాయతతో విసురుతున్నాడు శ్రీధర్.

సిస్టర్ ఫాతిమా వాకిలి కర్టెన్ వేయడం మరచిపోయిందిలా వుంది. వద్దనుకుంటూనే మరోమారు అటు వైపు చూసింది.

శ్రీధర్ కవిత చేతిని తన చేతిలోకి తీసుకుని మాట్లాడుతున్నాడు. శ్రీధర్‌కి కవిత అంటే ఎంత ప్రేమో అనిపించింది అపర్ణకి ఆ నిముషం. ఆమెలో అసూయ లేదు.

తన భర్త తన కళ్ల ఎదురుగానే మరో స్త్రీ పై ప్రేమ కురిపిస్తుంటే ఏ స్త్రీ అయినా సహించగలదా?

అయితే తనలో అసూయ ఎందుకు లేదు?

తనకి శ్రీధర్ పై అనురాగం లేదా? తను అతణ్ణి ప్రేమించలేదా, ప్రేమించడం లేదా?

అవును. అంతరంతరాల్లో అతడిపై అనురాగం మాసిపోలేదు తనకు

ఐతే చంద్రుణ్ణి మబ్బులు మూసినట్టు ఆ అనురాగాన్ని అసహ్యం కప్పేసింది.

చంద్రుణ్ణి కప్పిన మబ్బులు చెదరిపోగలవు.

కానైతే మనసుకు తగిలిన దెబ్బ మాసిపోదు.

తను శ్రీధర్‌ని, అతడి అందం చూసి ప్రేమించలేదు. హోదా చూసి ప్రేమించలేదు. అతడిలోని అనురాగాన్ని, తన భావాల్నర్థం చేసుకున్న అతడి అంతరంగాన్ని, అతడి అభ్యుదయ భావాల్ని, అతడి ఉదాత్తమైన వ్యక్తిత్వాన్ని ప్రేమించింది. అతడిలోని ఆ ఉన్నత సంస్కారాన్ని ప్రేమించింది. అయితే తననుకున్న, తానూహించిన వ్యక్తి రోజు రోజుకూ, కలలా కరిగిపోయాడు.

శ్రీధర్ వ్యక్తిత్వాన్ని స్థిరంగా, గంభీరంగా మెరిసే చలువరాతి బొమ్మగా ఊహించింది తను. అయితే అతడు తళతళలాడే మైనపు బొమ్మని, ఏ నిముషానైనా కరిగిపోతాడని తానూహించిందా?

శ్రీధర్ ఓ వ్యక్తిత్వం లేని మనిషి. అలాంటి మనిషితో జీవితాంతం గడపలేదు తను. మనసులో రాజీ పడలేదు తను.

కిటికీలోంచి చూసింది. శ్రీధర్ పైకి లేచాడు. మెల్లగా అడుగులు వేసుకుంటూ, తన గదివైపే వస్తున్నాడు.

ఆమె హృదయం వేగంగా కొట్టుకోసాగింది. అతణ్ణి ఎదిరించలేక, తలుపు వైపుగా వీపునేసి, కిటికీ ఊచల్ని గట్టిగా పట్టుకుని, మనసును అదుపులో పెట్టుకో ప్రయత్నించింది. ఆమె హృదయంలో ఒకే సమయంలో రెండు భావాలు, రాగద్వేషాలు.

ఉన్నట్టుండి అతడి అడుగులు డాక్టర్ నీలిమ గదిముందు ఆగిపోయాయి. వారి మాటలు కూడా వినబడుతున్నాయ్.

"గుడ్ మార్నింగ్ డాక్టర్..." అతడి కంఠం

"గుడ్ మార్నింగ్" నీలిమ కంఠం.

"కవిత మీరు చేసిన సాహసాన్ని చెప్పింది డాక్టర్" అతడి కంఠం వొణుకుతోంది. "మీ మేలు నా జన్మలో మరువలేను. కవితను బ్రతికించి నా సంసారాన్ని, సర్వస్వాన్ని కాపాడేరు."

"వోహో, భార్యంటే ఎంత ప్రేమ." అపర్ణ మనసు బాధతో మూలిగింది. అతడే 'అపర్ణా! నీవే నా సర్వస్వం. నీవే నా జీవితానికి అర్థం' అన్న రోజులూ ఉన్నాయి.

కానైతే అవి కవితకు తెలియను తెలియనివ్వకూడదు. ఆమె తన భర్తను గురించి ఊహించిన ఊహలు కల్లలు కాకూడదు. ఆ నిజాన్ని తనొక్కతే భరించగలదు. భరించాలి.

"సారీ డాక్టర్ శ్రీధర్ మిసెస్ అపర్ణ ఆ ఆపరేషన్ చేశారు. నేను చెయ్యలేదు. అసలు డాక్టర్ ప్రక్క గదిలో ఉన్నారు."

అతడు కుర్చీ జరిపి లేచిన చప్పుడు వినిపించింది. బూట్ల శబ్దం తన గది దగ్గరౌతోంది.

/ఇంకా వుంది/

# గడ్డి పరకలు

### ముమ్మిడి శ్యామలారాణి




రోడ్డుమీద పరుగులాంటి నడకతో నడుస్తున్నాడేకాని ఛాతీ క్రిందకు, పైకి ఆయాసంతో ఊపిరాడుతోంది రామయ్యకు.

ఈ నడక ఈరోజుది, నిన్నటిది కాదు. ఇంచుమించుగా పాతికేళ్ళ క్రితం నుండి ఈ చివరనుండి ఆ చివరకు పెద్ద బంగళా దగ్గరకు నడుస్తూనే ఉన్నాడు.

ఊరు మారింది, ఎన్నో మార్పులు వచ్చాయ్!

ఈ నడకలోనే తన తలలో నల్లవెంట్రుకల్లో తెల్ల వెంట్రుకలు చోటు చేసుకున్నాయ్! చురుగ్గా, హుషారుగా నడిచే తన శరీరం కాస్త వంగి, నిస్సత్తువగా నడవడానికి ప్రయత్నం చేస్తోంది కాని, తన మనసుని 'కీ' ఇచ్చి పరుగుకి వదలిన బొమ్మలా చిన్నప్పటికప్పుడు పరుగులాంటి నడకనే ప్రోత్సాహం చేస్తున్నాడు. ఇలా ఇంకా ఎన్నాళ్ళో నడవలేను. సైకిల్ అన్నా కొనుక్కోవాలి. లేక బస్సయినా ఎక్కాలి అని ఏరోజు కారోజు అనుకొనేవాడు కాని ఇంట్లో పెళ్ళిళ్ళకు ఎదుగుతున్న ఆడపిల్లలు, కంచం ముందు కూర్చుంటే వచ్చాడి మెతుకులు తన కోరికలని వాయిదా వేసేవి. బస్సు డబ్బులు దాస్తే ఇంత కూర అన్నం తిన వచ్చు. సైకిల్ వాయిదామీద కొనడం మానివేస్తే, ఇద్దరి కూతుళ్ళకి నలుగురిలోకి వెళ్ళినప్పుడు కట్టుకోవడానికి శుభ్రమైన బట్టలు కొనవచ్చుననుకుంటూనే ఉన్నాడు. కాని రెంటింటిలో ఏ ఒక్కటి చేయలేక పోయాడు. దానికి కారణం రెండొందలు జీతం. ఇంట్లో ఎదురైన సమస్యలకు చాలకపోవడమే! వయసు దాటిన జీవితం పెరిగిన జీతాన్ని చూపి సంతోషించిందేకాని, బజారులో నిత్యావసర వస్తువులు ఆకాశాన్ని అంటడం చూసి, గడిపిన జీవితమే నయం అనిపించింది రామయ్యకు. ప్రక్క నుంచి హారన్ కొడుతూ వెళ్ళిన కారుని చూసి ఆలోచనలనుండి తేరుకున్నాడు ఆతృతగా రోడ్డుమీద నడుస్తున్న మనుష్యుల వైపు చూసాడు. ఎదురుగుండా వస్తున్న యువకుని చేతికి వాచీ ఉండడంతో, "ఎంతైంది బాబు టైము?" అన్నాడు.

ఆ యువకుడు చిరాకు ప్రవేశించిన కళ్ళతో, నీకు టైముతో సంబంధం ఏమిటన్నట్లు "ఎనిమిది దాటింది" అన్నాడు.

ఎనిమిది దాటింది అన్న మాట వినగానే రామయ్య హడలిపోయాడు. ఆ వ్యక్తికేం తెలుసు, తనకి టైమ్ ఎంత అవసరమో! ఎవ్వరికైనా ఒక్క నిముషం దాటవచ్చు ఏమో కాని, ఇంజనీరుగారి భార్యకు ఎనిమిది గంటలు కొట్టేటప్పటికి తను వీధి తలుపు కొట్టాలి.

ఈరోజు ఎన్నడూ లేనిది ఆలస్యం అయింది. ఎంత తొందరగా బయలుదేరాలి అనుకున్నా ఆలస్యం అయింది. దానికి కారణం తన భార్య అస్వస్థత ఎన్నోరోజులుగా మంచం మీద ఉంటున్న అతని భార్య, బయలుదేరే ముందు హడావిడి చేయడంతో ఆ నిముషంలో ఇంజనీరుగారి భార్య గుర్తురాలేదు.

ఏలాగైనా ఈరోజు ఆఫీసులో ఒక నాలుగు రోజులు శెలవు అడగాలి. లేకపోతే పార్వతి మనసు కష్టపెట్టుకుంటుంది. ఎప్పుడు ఏమీ కోరని పార్వతి, ఈరోజు తనని దగ్గర ఉండమని కోరింది. ఆ కోరిక కేవలం తను ఆమె దగ్గర ఉండాలని కాదు ఆ కోరికలోని అర్థం, ఆమె ఏదో చెప్పాలని. ఆమె చెప్పదలచుకున్నది ఏమిటో తనకి తెలుసు. రక్తపోటు తీవ్రతతో కాలు చేయి పడిపోయి మంచం మీద ఉంటున్న ఆమె ఎన్నాళ్ళో బ్రతకదని తనకి తెలుసు! ఏం తెలిసినా ఏమి చేయలేని అసమర్థుడు. నిస్సహాయ స్థితిలో ఉన్న తనకి బాధ్యతలను గుర్తు చేయడానికి పార్వతి మనసు ఆరాటపడుతోంది ఆలోచనలు వదలని మనసుతో బంగళా ప్రవేశించాడు. బంగళా నడిచిన రామయ్య ఆలోచనలు చెల్లాచెదురైన ముత్యాల్లా, చెదిరిపోయాయ్! గోడనున్న గడియారంలా గుండె చప్పుడు స్పష్టంగా వినిపిస్తోంది రామయ్యకు. అంతలోనే భయంతో బెల్ నొక్కడానికి వెనకాడుతున్న మనసుని స్థిమిత పరచుకున్నాడు.

# గొప్ప జతగా




## భారతదేశపు ఏకైక దుర్గంధనాశక సబ్బు మరియు టాల్క్

దుర్గంధంనుండి రెండురకాలుగా రక్షణకు సరైన జోడీ...సింథాల్ సబ్బుతో స్నానం, ఆపైన సింథాల్ టాల్క్ చల్లుకోవడం ..మీరు ఎంతో, మరెంతో తాజాదనంతో హాయిగా మురిసిపోయేందుకు.

**గోద్రేజ్ వారి సింథాల్**

Interpub/CTS/1/80

ఇన్నేళ్ళుగా లేనిది ఈరోజే కదా తను ఆలశ్యం అయ్యాడు. ఇంట్లో పరిస్థితి చెప్పవచ్చు అనుకున్నాడు.

"కాలింగ్ బెల్" నొక్కాడు.

తలుపు తీయడం, ఇంజనీరు గారి భార్య రౌద్రకాళి రూపం దాల్చడం ఒకేసారి జరిగాయి.

"ఇప్పుడు టైమ్ ఎంతైందో తెలుసా?" అంది గోడనున్న గడియారం వైపు చూస్తూ.

రామయ్య గోడ గడియారం వైపు చూసాడు. "ఎనిమిది పదిహేను"

"ఈరోజు ఆలశ్యం అయిందమ్మా" అన్నాడు భయంగా రామయ్య.

"అదే! ఎందుకయింది ఆలశ్యం అంటున్నాను. నా గురించి నీకు తెలుసు కదా అన్నీ కరక్టు టైముకి జరగాలి సరిగ్గా ఎనిమిది గంటలకి నీవు ఇక్కడ ఉండాలని తెలిసి కూడా ఆలశ్యం చేసావంటే నీకంత భయం లేనట్టే కదా? ఇంకోసారి ఇలా జరిగిందంటే ఊరుకునేది లేదు తెలిసిందా?

## గడ్డిపరకలు

పాపం సునీ, హేమ బుక్స్ పెట్టెలో పెట్టుకుంటున్నారు. తొందర వెళ్ళు. ఇంకోసారి ఇలా ఆలశ్యం జరిగిందంటే..."

"అమ్మా ఇంట్లో మా ఆవిడ..."

"ష్...అవన్నీ నాకనవసరం..."

"స్కూలుకి టైమ్ అవుతోంది. వెళ్ళి దిగబెట్టిరా" అని వెనుతిరిగింది.

మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా ఇంజనీరు గారి భార్య చరచర అక్కడనుండి వెళ్ళిపోవడం బాధ అనిపించింది రామయ్యకు.

సునీ, హేమ వున్న గదిలోకి వెళ్ళాడు. అప్పటికే వాళ్ళు రెండు బ్యాగ్‌ల నిండా బుక్స్ పెట్టారు. వాళ్ళిద్దరూ నిర్లక్ష్యంగా ఒక చూపు రామయ్య వైపు చూసి, "యూస్‌లెస్ ఫెలో. టైమ్ ఇజ్ ఓవర్. నౌ హి హాజ్ కమ్' అంది సునీ, హేమతో కాన్వెంటులో చదువుతున్నారనడానికి నిదర్శనంగా చక్కటి ఇంగ్లీషులో.

గుమ్మం దగ్గరకు వచ్చిన రామయ్య చెవులకి ఆ మాటలు వినిపించక పోలేదు కాని ఆ మాటలను తన మనసు వరకు వెళనివ్వడం ఇష్టంలేదు రామయ్యకు తన లాంటి బతుకులకు ఇలాంటివి మామూలే!

రెండు భుజాలకు రెండు పుస్తకాల సంచులు తగిలించుకొని, రెండు వాటర్ బ్యాగ్‌లు రెండు చేతుల్తో పట్టుకున్నాడు.

"రండమ్మా" అన్నాడు.

రామయ్య పుస్తకాల సంచులతో ముందు నడుస్తున్నాడు. పక్కన సునీ, హేమ చేతులు ఊపుతూ హుందాగా నడవడానికి ప్రయత్నంచేస్తూ నడుస్తున్నారు. ఇలా సునీ, హేమతో ఎనిమిదేళ్ళుగా నడుస్తున్నాడు. అంతకు ముందు లలి, పప్పీతో, అంతకుముందు టింకు, పింకితో, అంతకు ముందు. అంతకు ముందు... ఇద్దరు ఆడపిల్లలు చాలు అనుకున్న సమయంలో వాసు పుట్టాడు "పేదలకు పిల్లలే ఐశ్వర్యం" అని ఎవరన్నారో కాని తను వాసు పుట్టినందుకు ఎంత విచారించాడో వాడు ఏం అనుభవించడానికి తన కడుపున పుట్టాడు

తనలాగే ఏ.డి. ఇ. బంగళా గేటు దగ్గర నిలబడి తలుపు తట్టడానికి భయపడే బ్రతుకు బ్రతకడానికేనా ? వెధవ ! వాడికి ఎలా తెలిసిందో?

"నాన్నా! నువ్వు రోజూ ఆఫీసరుగారి పాపను స్కూలుకి దిగబెడతావటకదూ? రోజంతా వాళ్ళింటిలోనే ఉంటావ్ ? నన్ను ఒక్కసారి మా బడికి తీసుకు వెళ్ళవూ ? అందరికీ నాన్నలు వసున్నారు. ఇడిగో మా నాన్న అని చూపెడతాను" అని మారం చెయ్యడంతో తప్పనిసరియ్యి, ఒకరోజు శలవు పెట్టి వాసుని స్కూలు దగ్గర దిగబెడతుంటే, గవర్నమెంటువారి జీపులో బజారుకి వెళతున్న ఇంజనీరుగారు, ఆయన భార్యచూసారు మరునాడు అడిగారు తను అబద్ధం చెప్పలేక వాసు కోరిన కోరిక చెప్పడంతో ఇంజనీరుగారు నవ్వారుకాని- భార్య గారు కోపంతో తారస్థాయి అందుకున్నారు. నీ కొడుకుని స్కూలుకి దిగబెట్టడం ఒకటా? అని విసురుగా అక్కడ నుండి వెళ్ళిపోయారు.

రామయ్య మనసు అదోలా అయింది. పదో తరగతి, పదిమిదో తరగతి చదువుతున్న సునీ, హేమలను తను రోజూ వాళ్ళ కూడా వెళ్ళాలి కాని, రెండో తరగతి చదువుతున్న తన కొడుకుని ఒకరోజు తను దిగబెట్టకూడదా? ఆలోచించిన కొలది అర్థం కాలేదు కాని ఆఫీసరగారి బ్రతుకుముందు తనలాంటి బ్రతుకులు ఏమిటో అర్థం కాసాగింది రామయ్యకు.

మరునాడు ఎప్పటిలాగే తెల్లవారినా రామయ్య మనసు ఎటువంటి ఆలోచనలు లేకుండా సంతోషంగా వుంది. అవును మరి! ఇన్నాళ్ళకి తను పెళ్ళి జరిపించడానికి తగిన స్థితిలో నున్న పెళ్ళికొడుకు, తను వ్రాసిన నన్నీ ఇష్టపడి పెళ్ళికూతురుని చూసుకోవడానికి వస్తున్నాడు, అమ్మాయి నచ్చితే పెళ్ళి స్థిరపడినట్లే. పెళ్ళి స్థిరపడడం అంటే మాటలా ? ఎంత చెట్టుకి అంత గాలి అన్నట్టు, తన స్థితికి తగ్గట్టు కట్నం అడిగేది ఎవరు? ఇన్నాళ్ళకి అన్ని విధాల సరిపడిన సంబంధం వచ్చింది.

"అయ్యా! నాలుగు రోజులు శలవు ఇప్పించండయ్యా" అన్నాడు రామయ్య.

"ఈ రోజు కుదరదయ్యా మా సునీ పుట్టిన రోజు. ఫ్రెండ్స్ వస్తారు. అన్నీ సప్లయ్ చేయాలి. నీవు లేకపోతే ఎలా" అన్నారు ఇంజనీరుగారు.

ఈ రోజు ఎంత అవసరమో చెప్పడానికి భయపడ్డాడు రామయ్య. చివరకు శలవు పెట్టడానికి కారణం చెప్పకపోతే శలవు ఇవ్వరు అని "మా అమ్మాయిని చూసుకోడానికి పెళ్ళివారు వస్తున్నారయ్యా, కనీసం ఒక్క రోజయినా శలవు ఇప్పించండయ్యా" అన్నాడు,

ఇంజనీరుగారు చురున కోపంగా కుర్చీ లోంచి లేచారు.

"ఈ రోజు కుదరదు అని చెప్పినా, నీవు శలవు కావాలంటే ఎలా ? సునీత పుట్టిన రోజు. నట్నీ అప్పుడే నీ అవసరం ఇంట్లో ఎంతో నీకు తెలుసు. ఈ రోజు నీవు రాకపోతే అమ్మగారు ఊరుకుంటారా."

మౌనంగా తల వంచడం తప్ప, ఏం మాట్లాడలేకపోయాడు రామయ్య.

బంగళా అంతా హడావిడిగా ఉంది. సునీ పుట్టినరోజుకి వచ్చిన ఆహూతులతో బంగళా అంతా నిండిపోయి ఉంది. యాంత్రికంగా పని చేస్తున్నాడేకాని మనసు ఆలోచనలతో సతమతమవుతూంది. పెళ్ళివారు ఏం అనుకుంటారో ? వచ్చినవాళ్ళకి ఆదరించడానికికూడ ఇంట్లో యెవరూ లేరు. పోనీ పార్వతి అయినా వాళ్ళతో ఏం మాట్లాడగలదు ? మంచం మీద నుండి లేవనేలేదు, పెళ్ళికూతురు లక్ష్మి ఏం మాట్లాడుతుంది ? సరళకి చిన్నతనం ... వాళ్ళతో ఏం మాట్లాడుతుందో ! శలవు అడిగి వెంటనే వస్తాను అని చెప్పి వచ్చాను. తను రాకపోవడంచూసి వాళ్ళు ఏం కంగారు పడుతున్నారో ! నాన్న పెళ్ళివారు వస్తారు అని తెలిసి కూడ రాలేదు అని మనసు కష్టపెట్టుకుంటుందేమో ! చిన్నఇంజనీరు గారి ఇంటినుండి వెళ్ళగానే సంతోషం నిండిన ముఖంతో, పెళ్ళివారి దగ్గర నుండి ఉత్తరం వచ్చింది నాన్నా అని తన చేతికి ఉత్తరం ఇచ్చింది లక్ష్మి. ఇన్నాళ్ళకి మంచి సంబంధం వచ్చింది. తప్పకుండా కుదురుతుంది అని ఉంది. ఈ సంబంధం కూడ తప్పిపోతే లక్ష్మి ఏమవుతుందో! ఇప్పటికే వరుల అన్వేషణలో తను, పెళ్ళిచూపులతో లక్ష్మి విసిగిపోయారు. ఈ సంబంధం తప్పిపోతే...ఉహూ... తప్పిపోవడానికి వీలు లేదు. నా లక్ష్మికి పెళ్ళి జరిగితీరాలి. ఆ కళ్ళలో వెలుగు చూడాలి.

ఒక్కసారి అందరు చప్పట్లుకొట్టడంతో ఆలోచనల నుండి తేరుకున్నాడు. సునీత దీపాలన్నీ ఆర్పుతోంది.

తన మనసులోని ఆశలనే చమురుతో



# గడ్డిపరకలు

వెలిగిస్తున్న దీపాన్ని ఒక్కసారి ఆర్పినట్లు యింది రామయ్యకు.

"ఏయ్ రామయ్యా! ఏమిటలా నిలబడ్డావ్? పని ఏం లేదనుకున్నావా? ఆ ఖాళీగా సులన్నీ కడిగి అక్కడ పెట్టు. తరువాత హాలంతా క్లీన్‌చేయ్!" ఉరిమి నట్లుగా అని అక్కడ నుండి వెళ్ళిపోయారు ఇంజనీరుగారి భార్య.

ఇంజనీరుగారి భార్య అలా అనడంతో, తనని వెంటాడుతున్న ఆలోచనలు చూపి తనపై తనకే కోపం వచ్చింది రామయ్యకు.

తన మనసు ఆలోచనలతో సతమతమవు తుందేకాని, వాటి విలువ తనలాంటి బ్రతుకు లకు ఎంతో ఆలోచించదేం?

"రామయ్యా, పొద్దున్నుండి చూస్తు న్నాను– ఏమిటా పరాకు? అంత పొగరు ఎందుకు వచ్చింది ఒక్క రోజులో? అంత కేర్‌లెస్‌గా గాజుగ్లాసు కడుగుతే పగిలి పోతుందని తెలియదా? ఆ గాజుగాను ఖరీదు నువ్వు ఇవ్వగలవా?" అని కోపంగా అంటున్న ఇంజనీరుగారి భార్యవైపు చూడ డానికే భయం వేసింది రామయ్యకు. మౌనంగా క్రింద పగిలిన గాజు పెంకులు ఏరసాగాడు.

* * *

"ఏమండీ! ఏంతపని చేసారండీ. పెళ్ళి వారు వస్తారు అని తెలిసికూడ, ఇంటికి రాకుండా అక్కడే ఉండిపోయారు. మీకు మనసెలా అంగీకరించిందండీ? నవ్యంగా కుదురుతుంది అనుకున్న సంబంధం తప్పి పోయిందండి. మగదిక్కు లేని ఇంటిలో, ఎవరు వాళ్ళతో మాట్లాడతారని అనుకు న్నారు? 'మేము వస్తాం అని తెలిసి కూడ మమ్మలను అవమానం చేసారు... మీతో సంబంధం అక్కరలేదు' అని వాళ్ళు వెళ్ళి పోయారు. భగవంతుడు నన్ను తీసుకువెళ్ళ కుండా కాలు, చేయి విరగ్గొట్టి మంచంమీద పడేసాడు" అని వలవలా ఏడ్వసాగింది పార్వతమ్మ.

రామయ్య నిలువునా నీరయాడు. తను చిన్నాళ్ళబట్టి ఎదురుచూస్తున్న ఆశ– నిరాశ అయింది. లక్ష్మికి మొఖం ఎలా చూపెట్టను? పార్వతికేం సమాధానం చెప్పను. బాధతో రెండు చేతుల మధ్య మొఖం దాచుకున్నాడు.

"అయ్యా! నాలుగు రోజులు శలవు ఇప్పించండయ్యా" అన్నాడు రామయ్య.

ఫైల్సులోంచి తలఎత్తి తీక్షణంగా చూసారు ఇంజనీరుగారు.

రెండు చేతులు కట్టుకొని నిలబడ్డాడు రామయ్య.

"ఏమిటి అంటున్నావ్?" అన్నారు ఇంజనీరుగారు.

"ఇంటి దగ్గర నా భార్య పరిస్థితి ఏం బాగుండలేదయ్యా. డాక్టరుగారు కూడా చెప్పారు, ఎన్నో రోజులు బ్రతకదని" అన్నాడు.

"మాట మాటకి శలవు ఏమిటోయ్? కేజువల్ లీవు అంతా వాడుకున్నావ్? మొన్ననే కదూ కూతురి పెళ్ళి చూపులని శలవు అడిగావు. మళ్ళీ ఇప్పుడు... ముందు అమ్మగారిని అడిగిరా."

పెళ్ళి చూపు లనగానే రామయ్యమనసులో గుండెని పిండినట్లయింది. ఆయనకేం తెలుసు? అమ్మగారు ఒక్కరోజు శలవు ఇవ్వకపోవడం వలన తన కూతురుకి కుదర వలసిన సంబంధం తప్పిపోయిందని, గుండెల మీద కుంపటి దిగుతుంది అని అనుకొ న్నాడు.

ఎప్పటిలాగే మరోసారి తలవంచి బంగళా దగ్గరకు నడక మొదలు పెట్టాడు.

"అమ్మగారూ! నాలుగు రోజులు శలవు ఇప్పించండమ్మా! నా భార్యకు బాగుండలేదమ్మా" అన్నాడు రామయ్య.

"ఏం? నన్ను అడుగుతావేం? నేనా నీకు శలవు లిచ్చేది? అయినా మొన్ననే కదూ శలవు పెట్టావు, మళ్ళీ ఇప్పుడు శలవు ఏమిటి?"

"అయ్యగారిని అడిగానమ్మా, ముందు తమరిని అడిగిరమ్మన్నారు" అన్నాడు రెండు చేతులు దగ్గరకు పెట్టుకుంటూ.

ఇంజనీరుగారి భార్య ముఖం ముందు ఆశ్చర్యంగాను, తరువాత కోపంగాను మారింది. "భ. భర్తగా ఆయనకేం తెలియకుండా పోతోంది. ఈ వారం రోజులు నీ అవసరం చాలా ఉంది. పిల్లలు పరీక్షలు. నువ్వయితే కరక్టు టైమ్‌కి వస్తావు. ఇక పిండి దంచాలి. వడియాల్లు పెట్టాలి అని నిన్ననే చెప్పాను కదూ? ప్రతీ ఏడాది నువ్వే చేస్తున్నావ్?"

"మా ఆవిడ పరిస్థితి ఏం బాగుండ లేదమ్మా డాక్టరుగారు కూడా చెప్పారు. ఈ ఒక్కసారి శలవు ఇప్పించండి. నేను రాకపోయినా అప్పారావు వస్తాడు అమ్మా. అప్పారావు పని బాగా చేస్తాడు అమ్మా" అన్నాడు భయపడుతూనే రామయ్య.

"నువ్వు నాకు సలహాలు ఇవ్వక్కరలేదు. ఈ వారం రోజులు నీతో చాలా పని ఉంది. అన్నీ క్రొత్తగా అప్పారావుతో చెప్పడానికి నాకంత ఓపిక లేదు" అని విసురుగా అక్కడనుండి వెళి పోయింది.

రామయ్య ఎప్పటిలాగే మౌనం వహిం చటం తప్ప ఏం మాట్లాడలేకపోయాడు. గుడ్డ పట్టుకొని ఒక్కొక్క కిటికీ తలుపులు తుడుస్తున్నాడే కాని మనసు ఆలోచన లందుకుంది. తుడుస్తున్న తలుపులోంచి తన ప్రతిబింబం లీలగా కనిపించింది రామయ్యకు. మాసిన గడ్డం కనిపించడం లేదు కాని సన్నగా, పుల్లలా ఉన్న తన శరీరం, పీక్కుపోయిన మొఖం కనిపించి చూపు మరల్చుకున్నాడు.

సిట్టింగ్‌రూమ్‌, హాలు, బెడ్‌రూమ్‌లు తుడవడం పూర్తికావడంతో డైనింగ్ రూమ్‌లోకి వచ్చి గుడ్డతో తలుపులు తుడవడం మొదలు పెట్టాడు. ఒక్కసారి తన ఇల్లు గుర్తు వచ్చింది. పేరుకి ఇల్లే కాని ఒకే ఒక్క గది. గదిప్రక్కన చిన్న వరండా. బాత్‌రూమ్‌, డ్రెస్సింగ్ రూమ్‌ అన్నీ ఎటాచ్‌డ్ ఆ వరండా. ఇక ఒక్క గది కిచెన్, బెడ్‌రూమ్‌, డైనింగ్‌రూమ్‌, సిటింగ్ రూమ్‌ ఎటాచ్‌డ్ అనే చెప్పుకోవాలి. సమానత్వం ... సమానత్వం అన్న వినాదం ఎక్కడో కనిపించడం లేదుకాని, భార్యభర్తల దగ్గర నుండి పిల్లల వరకు సమానంగా అక్కడే పడుకోవాలి. ఉద్యోగంలో చేరిన క్రొత్తలో పెద్ద ఇంజనీరుగారి బంగళా చూసి మూర్ఛపోయి నంతపని అయింది.

(44వ పేజీ చూడండి)

జీవిత గమ్యం

13-6-80 సంచిక

నుంచి ప్రారంభం!

**విజయ సాధనలో**
**తళ తళ మెరిసే తెలుపు!**




**"మహాలక్ష్మి ప్రొద్దుటినుంచి కనబటంలేదు!"**

**ఈ వార్త పది నిముషాల్లో ఆ వాడవాడంతా పాకి యింది**

'ఎక్కడికెళ్లిందో' అని కొందరి ప్రశ్నయితే— 'చెప్పాపెట్టకుండా వెళ్లే పిల్లకాదే' — అని మరికొందరి సందేహం. వరలక్షుమ్మ — అదే మహాలక్ష్మి తల్లి — ప్రొద్దుటినుంచి వచ్చి గంగయినా ముట్టలేదు. ఆ అమ్మాయి తరువాత వరుసవారి పిల్లల్లో అక్క కనబడటంలేదంటే అర్ధమయ్యే వాళ్లు కొందరు — కానివాళ్లు కొందరు. ఎందుకంటే — వరలక్షుమ్మ చేతిలో యిప్పుడో పిల్ల — దానిముందు రెండేళ్లదొకటి, నాలుగేళ్ల బాబు ఒకడున్నాడు. ఇంకా అయిదో తరగతి చదువుకుంటున్న పద్మావతి— ఇంటరులో గజనీలా దండయాత్రలు చేస్తున్న రమణ — వరలక్షుమ్మ భర్త పరమేశ్వరశాస్త్రి — ఇదీ వాళ్ల కుటుంబం.

బ్రాహ్మణార్థాలూ, పౌరోహిత్యాలూ చేసే పరమేశ్వరశాస్త్రిలో మంచి గుణాలేమీ లేకపోయినా, ఆ లేమిని పూడ్చటానికి కావలసినంత కోపము, అసహనము, ఉక్రోషమూ, చేతనైతే వరలక్షుమ్మనూ — పిల్లల్నీ చావబాదగలిగే చేవా వున్నాయి.

'అమ్మాయి కనబడటంలేదు. ప్రొద్దునవగా వెళ్లింది. కాస్త అలా వెళ్లి చూచిరండీ' — భయం భయంగా అన్న వరలక్షుమ్మకు మొట్టమొదటి బహుమానం చెంపదెబ్బ. 'ఇంట్లో యింతమంది తిని చెడతిరిగే వాళ్లున్నారు. మీరంతా యేం చేస్తున్నార'న్న అరుపులతోసహా, నాన్న భీకరాకారం చూసి గుక్కపట్టి యేడుస్తున్న పిల్లలు ముగ్గురికీ వరుసగా లెక్కప్రకారం వడ్డించి, అక్క కనబడటంలేదంటే అమ్మ నెందుకు కొడుతున్నాడో అర్థంకాక — తన్నుకునివస్తున్న యేడుపుని రానీకుండా అణుచుకుని నిలబడ్డ పద్మావతిని, జేవురించిన మొహంతో అసహ్యంగా చూస్తూ "ఇంకా యేమిటలా గుడ్లు వెళ్లబెట్టి నిలబడ్డావు దిష్టి బొమ్మలా, వెళ్లి విచారించుకురాక" అని తిట్టి, "వెధవగోల" అంటూ కండ్రించి ఉమ్మేసి వెళ్లిపోయాడు శాస్త్రి — కాదు పిల్లలకు తండ్రి, వరలక్షుమ్మకు భర్తగా పిలవబడే ఆ బాధ్యతాయుతుడైన ఇంటి యజమాని. అంతటితో తన బాధ్యత తీరిందనుకున్నాడేమో మరి.

భర్త కొట్టిన దెబ్బలకు యేడవాలో — చేతికందివచ్చిన కూతురు కనబడకపోయినందు కేడవాలో తెలియక నిలబడిపోయిన వరలక్షుమ్మకు ఇంటిలో మహాలక్ష్మి లేని లోపం కొట్టొచ్చినట్టు కనబడసాగింది. నోరు మూసుక్కూచున్న కుట్టుమిషన్, మహాలక్ష్మి లేనిదే మరో అవతారం యెత్తేందుకు వీల్లేదే అని దిగులుగా సంచీలోంచి తొంగిచూస్తున్న బట్టలు, చిన్నవాడు ఇందాక తింటూ సగంలో వదిలేసిన బెల్లం ముక్క చుట్టూ ఝుమ్మని సంగీతం పాడుతూ చేరుతున్న ఈగలు... ఇలా ఇవన్నీ వరుసగా చూస్తున్న వరలక్షుమ్మ మనసులో మళ్లీ దిగులు చోటు చేసుకుంది. దానికున్న కొద్దిమంది స్నేహితుల యిళ్లల్లో అడిగి వచ్చిందిప్పుడే పద్మావతి. ఇంకా తరచూ బట్టలు కుట్టించుకునే సి. టి. వో. గారి ఇంటికీ, పక్కవీధి కోమట్లమ్మాయి శాంత దగ్గరికీ... యిలా వెళ్లి వాళ్లయిండ్లకు మహాలక్ష్మి వెళ్లలేదన్న వార్త మోసుకొచ్చింది.

ఇంట్లో సభ్యుడుగా వుంటూ కూడా క్షణం తీరికలేని గెజిటెడ్ ఆఫీసర్లా రోడ్లు సర్వేచేసే రమణకు ఇంకా మధ్యాహ్నం తిన్నకూడు అరగలేదు కాబోలు గూటికి

"రాజాకు పాలు అంటే ఒకప్పుడు అయిష్టం... నేను న్యూట్రామూల్ కలిపి యిచ్చినప్పట్నించి మహా యిష్టం"





# "మరిప్పుడు వాడు న్యూట్రామూల్ మొనగాడు"

పిల్లలు పాలు తాగటానికి మారాం చేస్తున్నారా? లేదు, అంటున్నారు రుచికరమైన న్యూట్రామూల్ కి దీవనలిచ్చే అసంఖ్యాకమైన తల్లులు. రుచికి రుచీ, బలానికి బలం, న్యూట్రామూల్‌లో కోకో, పాలు మాల్ట్ లతో పుష్టి వుంది– బలే రుచి. మరి దీన్లో ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజాలూ వున్నాయి. పెరుగుతూన్న దశలోని శరీరానికి పుష్టినిచ్చేవి యివి. సువాసనతో నిండిన న్యూట్రామూల్ ప్రతి కప్పూ ఎంతో పోషణని యిస్తుంది.






మార్కెట్ చేయువారు
గుజరాత్ కో-ఆపరేటివ్
మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

అమూల్
## న్యూట్రామూల్
ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు!

daCunha GCM-16 TL

చేరుకోలేదింకా. ఎప్పుడు వాణ్ణి భర్త చావబాదినా, తిట్టినా కన్నతల్లి మనసులో వెనకేసుకు వచ్చే వరలక్షమ్మ అప్పుడు రమణను తిట్టుకుంది — 'చావనైనా చావడు పాపిష్టి ముండావాడ'ని.

ఒక చెంప చీకటి పడిపోతూ వుండటం చూసిన వరలక్ష్మమ్మ 'దీపం వెలిగించమ'ని అకారణంగానే కసురుకున్నది.

ఇంతలో సి. టి. వో. గారి అబ్బాయి వచ్చాడు 'రేపే గదా ఉగాది' అమ్మ రవికెలు కుట్టారో లేదో కనుక్కురమ్మంది'—అంటూ. ''ఇవతల పిల్ల కనబడటంలేదు మొర్రో అని మేమేడుస్తుంటే—బట్టలు కుట్టలేదేమిటి ? అని నిలదీస్తున్నారు అదేదో సామెత చెప్పినట్టు— భర్త చచ్చి నేనేడుస్తూ వుంటే...'' మనసులో ఉక్రోషమంతా బయటికి వెళ్ళ గక్కే వీలులేక కన్నీళ్ళ రూపంలో తోసుకొచ్చిందామెకు. ''నేనూ అదే చూస్తున్నాను బాబూ మీ బట్టలేకాదు, లశాంతమ్మ వాళ్ళబట్టలు కూడా వున్నాయి. ముదనష్టపు ముండ...యెక్కడికెళ్ళిందో యేమో! నాలుగు రాళ్ళు సంపాదిస్తున్నానని యీమధ్య దానికి పొసురు ఎక్కువైంది.'' వరలక్షమ్మ ధోరణి చూసి, వచ్చిన అబ్బాయి మెల్లగా జారుకున్నాడు ''నిజమే. యెవరి అవసరం వాళ్ళది.

# వేపపూత

రేపే ఉగాది. ఆయనెలా వున్నా... పిల్లల్ని చూసి సంతోషపడతూ గడుపుతున్నాను. ఇదిలా చేస్తుందని అనుకున్నానా .. అయినా పిల్లలందరిలో కల్లా బుద్ధిమంతురాలు, గుణవంతురాలు... చదివించి వుంటే ఈపాటికి యే బియ్యేనో పాసై వుండేది అందరి పిల్లలా ఆస్తోమతే వుంటే ఇట్లా యేడ్చేదా సంసారం... పాపం పట్టుమని పంతొమ్మిదేళ్ళయినా లేవు దానికి దాన్ని ఈ సంసార రథం యీడ్చేందుకో పావులా ఉపయోగిస్తున్నారు. అయినా ఈ లోకం తీరు విచిత్రం. యెన్ని ఉగాదులు... యెన్ని సంక్రాంతులు రావు... 'వీళ్ళయింట్లో పరిస్థితిలా వుందికదా ! ఏమడుగుతాంలే' అని అనుకున్నారా యెవరయినా... ఏం మనుషులో యేమో —'' గోడకానుకుని ఆలోచనల్లో మునిగింది వరలక్షమ్మ. పక్కింటి నరసమ్మ వచ్చింది యింతలోనే — ''ఊళ్లో అమ్మాయిలను యెత్తుకువెళ్లి వాళ్లొచ్చారటే వరలక్ష్మి ! బొంబాయికి తీసుకువెళ్లి సాని కొంపల్లో చేరుస్తారటే ! మహాలక్షమ్మ యెక్కడికెళ్ళిందో యేమో పాపం...నీ దిగులు చూస్తుంటే నా కడుపు తరుక్కు పోతోందే వదినే ! కానీ ఒంటె పక్షిని నేనేం చేయగలను?'' సానుభూతి చూపిస్తూనే భయపెడుతున్న నరసమ్మ వైపు భయంగా చూసింది వరలక్షమ్మ. 'నా మూర్ఖత్వం మండిపోను... అలాంటిదేమీ వుండదులే. ఎక్కడికెళ్ళిందో పాపం... ఆలస్యమైపోయింది. అయినా ఈ మహాపట్నంలో బస్సులవీ సరిగా దొరకాలా... వస్తామ్మా—' అంటూ, సాంత్వనపరచి వెళ్లినా యిప్పుడు ఒంటరిగా పిల్లలతో వున్న వరలక్షమ్మ మనసులో పురుగులా దొలచేస్తూ వుంది ఆ విషయం. పిల్లకే ప్రమాదమూ రానివ్వవద్దనీ, లక్ష దేవుళ్ళకు తలా ఒక టెంకాయ కొడతాననీ— మొక్కుకుంటున్నప్పుడు తమ గర్భ దారిద్ర్యం మాట గుర్తే రాలేదామెకు పాపం.

మధ్యాహ్నం రెండున్నరవరకూ యెదురు చూసి చూసి అలసిపోయి, వండిన అన్నం పిల్లలకు పెట్టిందేకాని, ఒక్క మెతుకు నోట్లో పెట్టుకోలేదు. ఒకవైపు పిల్ల యెక్కడికి వెళ్ళిందోనన్న బాధ, మరోవైపు ఆకలిబాధ—మాడుస్తూ వుంటే దీనికంతటికీ కారణమైన మహాలక్ష్మి యెదుట నిలిచినట్లే తిట్టటం మొదలెట్టింది. 'వెధవ సంత ! వెళ్లేదెటూ చెప్పిపోతే యెవరికీ యీ చావు వుండదుగదా ! అయినా యీమధ్య నాలుగు రాళ్ళు సంపాదిస్తోందని పొగరైపోయింది'— అన్న మాటలే, మరి మరీ అనుకుంటూందే కాని పిల్లకే ప్రమాదమూ రానివ్వవద్దని, మహాలక్ష్మి అలాంటి పిల్ల కాదని నిశ్చితాభిప్రాయమే వుంది ఆమెకు. ఇలా అక్కయ్యకు సహస్రనామాలు పెడుతున్న అమ్మను చూస్తూ, అక్కయ్య యెక్కడికెళ్ళిందా అని తన చిన్న బుర్రతో తెగ ఆలోచిస్తోంది పద్మావతి కూడా.

పిల్లలంతా తల్లిచుట్టూ చేరి ఒకసారి అమ్మ వైపు, మరోసారి అక్క వైపూ చూస్తున్నారు. పోనీ యెవరినన్నా సహాయమడుగుదామంటే ఆ వీధిలో అందరికీ వీళ్ళంటే చిన్నచూపు. అయినా సిగ్గువిడిచి పక్కింటి కామాక్షమ్మ యింటికి వెళ్ళి ఆవిడ పిల్లన్ని బతిమాలింది. 'మీ రమణేమయ్యాడు ?' అని సవాలక్ష ప్రశ్నలు వేసి, మహాలక్ష్మి యెప్పటినుంచి కనిపించటంలేదో, వెళ్లేముందు యేం చెప్పిందో అన్నీ వివరంగా పదిహేను నిముషాలు నిలబెట్టి సవివరంగా తెలుసుకుని, ఆఖరుకు తన కొడుకులు యింట్లో వున్నా 'మా అబ్బాయిలెట్



విజయ మాధవి వారి 'బెబ్బులి' షూటింగు మొదలు వూటీలో జరిగింది. చిత్రంలో డైరెక్టర్ వి. మధుసూదనరావు, శ్రీయుతులు రమేష్, స్వామి, కృష్ణంరాజు, రాఘవులు, రత్నాకరరావులను చూడవచ్చును.

వెళ్ళార'ని కొందరంటే 'వాడికి క్లాస్ టెన్స్ వుందట! యెక్కడికీ వెళ్లనంటున్నాడ'ని వెంకతిరుగుడుగా మరికొందరు అన్నారు. నిజమే యెవరికెవరు? అవసరమైనపుడు ఇంటికి వచ్చి తెల్లారేసరికల్లా బట్టలు కావాలని అర్జెంట్‌గా ఇట్టించుకు వెళ్లే వాళ్ళు. 'ఏరు దాటి తెప్ప కాల్చే రకాల'ని సామెత వూరికే రాలేదుగదా! – మానవ నైజంపై విచారణ కొంతసేపు. 'ఇట్టే బట్టలకు గోజి గోజి డబ్బులిచ్చేవాళ్ళ – వీళ్లకు దయ, సానుభూతి యెక్కడుంటాయి' – వేదాంతధోరణి కొంతసేపు.

ఇంట్లో పరిస్థితి ఇలా వుండగా, దాదాపు యెనిమిదిన్నర గంటలకు నోట్లో వేసగించబున్నా – దవడలు వాటి పని అవి చేస్తున్నా – కూనిరాగం మాత్రం ధారాళంగా పాడుతూ హుషారుగా యింటికి చేరుకున్నాడు రమణ. తల్లి చేసిన అష్టోత్తరనామావళిని సగౌరవంగా అందుకుని, కాళ్ళు కడుక్కునే నెపంతో దొడ్లోకి వెళ్లి, అలాగే నీళ్ళు తాగే మిషతో వంటింట్లోకి వెళ్లి పోపు పెట్టెలో తల్లి దాచివుంచిన పావలాబిళ్లను జేబులో పదిలంగా దాచుకుని వెళ్లిపోయాడు రమణ. అతనిలో ఒకే ఒక సుగుణం వున్నది. ఎవరెన్ని తిట్టినా నోరెత్తకుండా పడి వుంటాడు

'అమ్మా ఆకలే' అంటూ రాగమెత్తిన పిల్లలను 'ఉండండే మీదొక వెధవ గోల. అక్కయ్య రానీండి' అంటూ వీపుమీద తాళాలతో అంతవరకూ ఆపగలిగినా, ఆకలితో యేడ్చి అలసిపోయి అక్కడే పడుకుని జోగుతున్న పిల్లల్ని చూసి కడుపు తరుక్కు పోయింది. హడావిడిగా డబ్బా అడుగున వున్న పావున్నర బియ్యం వండి వాళ్లకు తినిపించింది. ఇన్నీ చేస్తున్నా మనసులో మాత్రం కుంపటిలా కాలుతున్న సమస్య, 'మహాలక్ష్మి యెక్కడికెళ్లింద'న్నది.

అన్నాలు తిని నిద్రపోతున్న పిల్లలపై పాత చీరకప్పి యెదురు చూస్తూ కూర్చుంది వరలక్షమ్మ. కూర్చున్న చోటే గోడకానుకుని జోగుతూంది పద్మావతి. వీధిలో మిగతా జనం మాత్రం సవ్యంగా తమ పనులు ముగించుకుని, నిద్రకు ఉపక్రమించే వేళకు ఉస్సూరంటూ వచ్చాడు శాస్త్రి. 'వస్తే వచ్చింది. రాకపోతే చచ్చిందనుకుంటాను' అంటూ చేతిలో బీడీముక్క ఆఖరి వరకూ పీల్చి కాళ్లు కడుక్కుని వచ్చి వంటింట్లో నుండి 'పిండాకూడు యీ పూటకైనా పెట్టేదుందా లేదా?' అని అరిచాడు. కళ్ల నీరు ఒత్తుకుంటూ భార్య చేసిన వడ్డనను మహాలక్ష్మిని ఆడి పోసుకుంటూనే ఆరగించి, ఇంట్లో అడ్డదిడ్డంగా పడుకున్న పిల్లల్ని పంది పిల్లలంటూ పోలికపెట్టి తిట్టి, వేయి కన్నులతో యింట్లోని వినోదాన్ని చూస్తున్న మంచాన్ని విసురుగావంచుకుని పడుకున్నాడు– ఆ మగ మహారాజు. భర్త ధోరణికి నవ్వాలో యేడవాలో తెలీలేదు వరలక్షమ్మకు. అప్పుడు వెళ్లిన రమణ అజా పజా లేదు. దిగులు పడుతూనే స్థంభానికి చేరగిల బడింది.

* * *

తెల్లవారు ఝామునే మెలుకువ వచ్చిందామెకు. ముందుగా జ్ఞాపకం వచ్చిన సంగతి మహాలక్ష్మి. ఏం పనులు చెయ్యాలో తోచక నీరసించిపోయిందామె. నిశ్శబ్దంగా యేడుస్తూ కూర్చుంది. పూర్తి తెల్లారి పొయ్యేక లేచిన శాస్త్రి, భార్య అందించిన నీళ్ల కాఫీని ఆలోచిస్తూ అర్ధగంట తాగి మరో మాట మాట్లాడకుండా పైపంచ భుజాన వేసుకుని వెళ్లిపోయాడు.

ఒకరి తరువాత ఒకరులేచారు పిల్లలంతా. దంత ధావన కార్యక్రమాన్ని హడావిడిగా ముగించి, గిన్నె అడుగున మిగిలిన పచ్చడు మెతుకుల్నీ చింతకాయ పచ్చడితో కీచులాడుకుంటూ తిన్నారు. రెండేళ్ల పిల్ల కూడా వీళ్లకేమీ తీసిపోలేదు. 'దరిద్రుడికి ఆకలెక్కువ' గదా! అన్నాలు తిని నీళ్లకోసం అరుస్తున్న పిల్లలను చూసి బిందె చంక నేసుకుని వీధికుళాయి దగ్గరికెళ్ళింది వరలక్షుమ్మ. అప్పటిదాకా ఇందిరమ్మ చెవులు కొరుకుతున్న నరసమ్మ గట్టిగా అంది— "అయినా కాలం పాడయి పోతోందిలే. బ్రాహ్మణ మఠం మంట గలిసిపోతూంది. అయినా ఈ ప్రభుత్వం వాళ్ల కిదేం పోయేకాలమొచ్చిందో! మహలక్ష్మిలా మాంవాళ్ణి పెళ్లి చేసుకునే వాళ్లకంతా ఉద్యోగాలిస్తాం..డబ్బులిస్తాంఅంటూన్నారు. అయినా చేసుకునే వాళ్లకు బుద్ధుండఖర్లే... డబ్బుకోసంనానాగడ్డీ తింటవేనా?" వినబడ్డ మాటలకి తల తిరిగిపోయిందివరలక్షుమ్మకు. "ఏమిటక్కయ్యా! నా కూతుర్ని యింతలేసి మాటలనటానికి నీకు నోరెట్లా వచ్చింది? అయినా నాకూతురితో 'కొంచెం పప్పు రుబ్బిపెట్టే మహలక్ష్మీ, ముసిలిదాన్ని, చేసుకోలేను, కొంచెం ఆ చీర ఉతికి పెట్టవే తల్లీ...కాళ్లు పీక్కుపోతున్నాయ'ని పని చేయించుకున్నది ఇంమకా? కూటికి పేద వాళ్లయినా కులానికి పేదవాళ్లం కాము లేవమ్మా,"— అని ఉక్రోషంగా అంటున్న వరలక్షుమ్మను తన వాగ్ధాటితో నిలిపేసింది నరసమ్మ. 'ఆ... అవును ... చేయించుకున్నాను. యింట్లో మిగిలిన పప్పూ చారునీళ్లూ నీ ఇంటికి గిన్నెలతో సరాఫరా చేసి కూడా... చేయించుకున్నానే తల్లీ... అయినా యెగిరెగిరి మంగలం మీద పడినట్లు వెధవపని చేసింది చాలక దాన్ని వెనకేసుకుని వస్తున్నావా! అదేదో శరణాలయంలో వుండే వెధవ, నీ కూతురు నిన్న మధ్యాహ్నం రిజిష్టరాఫీసులో నుంచి పూలమాలల్తో వస్తూంటే లవతల వీధిలో శాంతమ్మ మొగుడు చూశాడట! పెదు వాళ్ల వెనకే వెడితే తిన్నగా తిరుపతి బస్సెక్కారట! ఇంకేమంటావ్. కూతురు చేసిన పనిని బయట పడనీయకుండా వుండాలని యెంత నంగనాచి కబుర్లు చెబుతున్నావే తల్లీ'— యీసడించి ఏడేస్తున్న నరసమ్మను అదిలించింది వరలక్షుమ్మ."ఆ...అవునవును.

# వేపపూత

నీ విచ్చే పప్పు చారులతోటే మా సంసారం వెళ్లమారుతూంది. అయ్యోరామ... ఇదిగో నరసమ్మా! యెవర్నో చూసి, యేదో అనుకుని యేదో వాగితే కాదు. ఇంక యిలా మాట్లాడితే జాగ్రత్త! నా కూతురే అట్లాంటి పని చేసిందంటే దాన్ని నరికి పోగులు పెడతాను —" అంటూ అరిచి ఉక్రోషంగా ముఖం తుడుచుకుని ఖాళీ బిందెతోటే విసవిసా ఇంటికి వచ్చి కూలబడిపోయింది. 'నిజంగనే ఇట్లా చేసి వుంటుందా అది? దాన్ని నరికి పోగులు పెడతాను. ఏదో చేతికి అందివచ్చిందిలే అనుకుంటే బాగానే బుద్ధి చెప్పింది. మనం బ్రాహ్మణులమే ఈ పనిచేస్తే మన పరువేంగాను... కులమేంగాను. ఆయనకీ విషయం తెలిస్తే సున్నంలోకి యెముకల్లేకుండా కాల్చిపారేస్తారే... దాన్ని యింటికి రానీ చెబుతాను...' ఇలా




సాగుతున్నాయి ఆమె ఆలోచనలు. ఎనిమిది గంటల ప్రాంతంలో రమేష్‌తో పాటు ఇంట్లోకి వచ్చిన మహలక్ష్మిని చూస్తూనే నిర్ఘాంతపోయింది వరలక్షుమ్మ. ఆ తరువాత విరుచుకుపడింది. 'ఏమే వెధవముండా! ఇలాంటి పాపిష్టి పని చేస్తావా! వాళ్లంతా అంటుంటే నా కూతురు అలాంటి పని చేయదని రొమ్ము గుద్దుకుని చెప్పివచ్చానే— ఆఖరికి ఆ పనే చేసి, యే ముఖం పెట్టుకుని వచ్చావే... వెళ్లు... దయచెయ్ ఇక్కడి నుంచి... ఏరా! మా పిల్లకు బుద్ధుండక పోతే నీకుండక్కర్లే? పెద్దకులం పిల్ల దొరికిందే చాలని చేసుకున్నావా! ఇంతోటి ముఖానికి మీవాళ్లలోనే దొరక్కపోయారా? ఏమే. ఇంకా నిలబడ్డావు. ఉద్ధరించింది చాలుగాని బయటికి కదులు... ఇన్నేళ్లనుంచి పెంచి పోషించిన మాకంటే ఈ వెధవే యెక్కువా నీకు? ఇద్దరూ వెళ్లి యే గంగలో నయినా దూకండి! పదిమందిలో నేనెట్లా తలెత్తుకు తిరిగేది? నేనే ఛస్తాను ముందు...' అంటూ స్తంభం పై భాగంలో వుండే బల్లగూడు తీసి లోటా నీళ్లలో వేసుకుని తాగబోతున్న తల్లిని ఆపి, నీళ్లు బయటికి చల్లేసింది మహలక్ష్మి. 'ఛీ! ముదనష్టపు ముండా! మమ్మల్నయినా చావనీయవే! మా ఇంటినంతా మైల చేస్తున్నావు. బయటికి నడు!' కొట్టటానికి చేయెత్తిందామె. "ముందు నేను చెప్పే మాటలు వినమ్మా. ఇదంతా మీకోసమే చేశానమ్మా... ఇట్లా చేస్తే గవర్నమెంటు వాళ్ళు కొంత డబ్బు యిస్తారు. ఉద్యోగం చూపిస్తారు. ఈయనకొచ్చే సంపాదనకూడా మన ఇంటికే యివ్వాలన్న షరతుపైనే ఈ నిర్ణయానికి వచ్చానమ్మా... మనం తిండి తినకుండా మాడుతూవుంటే లోకం సానుభూతి చూపుతుందే కాని సహాయం చేయదమ్మా... నాన్న సంసారాన్ని పట్టించుకోడు. తమ్ముడు చదువుకుని కుటుంబ భారం మోస్తాడని నమ్మకం, ఆశా రెండూ లేవు. ఆడవాళ్లం మనమెంత కాలం చేయగలమమ్మా. సుబ్ రోజంతా కష్టపడి రెక్కలు ముక్కలు చేసుకున్నా ఆ నూలు వడకటంతో రోజుకు రెండు రూపాయలైనా రావు ఈ సమస్యకు పరిష్కారం నాకు తోచలేదమ్మా... అయినా రమేష్ అనాధశరణాలయంలో పెరిగినా— పేరుకు పంచముడైనా ఉత్తముడమ్మా.. ఇంటర్‌లో క్లాస్‌మేట్. ఇక్కడే వుండి మన సంసారాన్ని వృద్ధిలోకి తెస్తానని మాట యిచ్చాకనె దీనికి తయ్యారయ్యాను. కులం, మతం ఆవేశాలకు, మూఢ నమ్మకాలకు ఆధారాలే కాని... కూడు, గుడ్డ యివ్వ లేవమ్మా...చిన్నదాన్ని నీకు చెప్పేటంతటి దాన్ని కాను. నా తప్పేమయినా వుంటే నీ చేతుల్తో నాకే ఆ విషమియ్యమ్మా!" మహలక్ష్మి మాటలకు కొట్టటానికి చెయెత్తిన వరలక్షుమ్మ అలాగే నిలబడి పోయింది. ఆమె చూపు యెదిరింటి వేపచెట్టుపై విరగగాసిన వేపపూతపై నిలబడి పోయింది చిన్నప్పుడు ఉగాదినాడు వేప ప్రసాదం తినటానికి మారాం చేసే మహలక్ష్మికి తాను నవ్వుజెప్పుతూ చెప్పే మాటలు గుర్తొచ్చాయి. "వేపపూత తినటానికి చేదేగానీ ఆరోగ్యానికి మంచిదమ్మా! ఉగాదిరోజు తినే యీ ప్రసాదం బ్రతుకులా తీపి, చేదుల కలయికలాంటింది..." ★

# ప్రశ్నావళి

**-కె. రామలక్ష్మి**

పి. సి. — నిజామాబాదు

సాటి ఆడదాన్నిచూసి ఓర్వలేని మీ ఆడవారు మగవాళ్లతో సమానంగా హక్కులు, అధికారాలు కావాలనుకోవడంలో అర్థం వుందా?

★ సాటి మగవాళ్లతో మీ కిటువంటి పోటీ ఎప్పుడు లేదా? అలాంటప్పుడు మీలో మీకుమటుకు ఎందుకో అధికారాలు, హక్కులు?!

పి. బి. వి. — నందిరాజు తోట

పిలిచింది — పలికాను
వలచింది — కులికాను
మురిపించి బులిపించి
కన్నీట నను ముంచి
తానెళ్లి పోయింది
నిరాశను మిగిల్చి.

★ అందుకే పాపం!
అనురాగ విపంచి
చేరింది కంచి!!

లేకుంటే తననే ముంచుతారని గ్రహించి వుంటుంది.

ఆనారా — ఖర్గపూరు

జీవితంలో ప్రతిదీ చవిచూడడం తప్పు కాదంటాను. మీరు నాతో ఏకీభవిస్తారా?

★ ఎలా ఏకీభవించను. అడ్డమైనవి చవిచూడడం ఆరోగ్యానికి మంచిదికాదని కదా పెద్దలు చెప్పేది!

టి. డి. ఎల్. — కందుకూరు

ఇప్పటి సినిమాల గురించి మీ అభిప్రాయం ఏమిటి?

★ చూసి ఎప్పటి కప్పుడు మరచి పోయేలాంటి ఉత్తమ కళా ఖండాలే — అన్నీ!

టి. వి. ఎస్. ఆర్. — ఆండలూరు

ఐ హేట్ యు ఫర్ నాట్ ఛేంజింగ్ యువర్ సర్ నేమ్...

★ ఐ హేట్ యువర్ మేల్—భావ నిజమ్ !

ఎ. పి. ఎల్. — పూనేపల్లి

ప్రేమించినది అందనినాడు ద్వేషిస్తారు మానవులు ఎందుకని?

★ ప్రేమా — ద్వేషం — నాణేనికి రెండు ప్రక్కలు. అందేత అవి అంత తొందరగా — రూపాంతరం చెందుతూ వుంటాయి!

కె. జి. ఎస్. కె. — కుప్పం

అక్కయ్యా! నేను అందరితో స్నేహంగా, అభిమాన పూర్వకంగా మాట్లాడాలని అభిలషిస్తాను. ఏరకమైన మాటల ద్వారా స్నేహితులను మనవైపు ఆకర్షింపచేసుకోవాలి?

★ బాగుంది చిట్టితల్లీ — నన్ను యిలా ప్రశ్న అడగడం? ఎలా మాట్లాడతానో నాకే తెలియదు— నా స్నేహితులు మటుకు నోటితో నవ్వుతూ, నొసటితో వెక్కిరిస్తూ వుంటారు! అదే గ్రహించలేని దాన్ని! ఇక నేనేం చెప్తాను! ఇదిగో! ఏదో వశీకరణ వుంగరం వుందని పత్రికా ప్రకటనలు చూస్తూ వుంటాను. ఒకటి తెప్పించి పెట్టుకు చూస్తాను. ఫలితం నీకు తెలియచేస్తా! కాస్త ఓపికపట్టు.

ఎ. పి. బి. — గుడివాడ

భర్తకు అక్రమ సంబంధం వుంటే భార్య సహించకలదు. కాని భార్యకు అక్రమ సంబంధం వుంటే భర్త సంహించలేడు. ఎందుకని?

★ ప్రతి మగవాడూ 'తన' సంతతి అక్రమ సంతతి కాకూడదనుకోవడంవల్ల!

వి. ఎమ్. — నల్లమాడు

అక్కయ్యా! నేను కథ వ్రాసి పత్రికకు పంపాలను కుంటున్నాను. దయచేసి ఎలా వ్రాయాలో! అఫ్‌కోర్సు అంటే, ఒకే సైడు వ్రాయలా రెండు సైడులు వ్రాయవచ్చా? వ్రాసిన కాగితాలను ఎలా పోస్టు చెయ్యాలి? కవరులో పెట్టాలా? లేక ఎలా చేసినా ఫరవాలేదా? ఏ సైజు తావుల మీద వ్రాయాలో కాస్త వివరంగా రాస్తారా?

★ నీ ఉత్తరం చదివి మతి పోయింది మాధవీ! ఎందుకొచ్చిన వ్రాయడం గొడవ? తిన్నగా వెళ్లి ఎడిటరుగారికిచెప్పి కథ రాసుకోమనకూడదూ?

వి. బి. ఎస్. — నాగాయలంక

నాకూ రచయిత్రివి కావాలని వుంది. కాని రచనలు కుదరవు. ఏమి చేయమంటారు?

★ రాస్తూ వుండడమే — వినలేదా తీయగా తీయగా వచ్చినట్టు అదే 'రాగం' అవుతుందని! అలాగే రాయగా రాయగా రచనే కూర్పుంటుంది. పంతం ఫలితాన్ని తెస్తుంది.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలు పంపదలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరు మీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివర కూడా స్పష్టంగా వ్రాయాలి— హామీ పత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని తిప్పి పంపబడాలని కోరుకునే వారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, వివరంగా వ్రాయందే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ల లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతి కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్ల పై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్మ' వారికి తప్ప తతిమ్మా అందరికీ; అవి పద్మ "ప్రతు"లన — కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. సం.



'ఆపద్బాంధవులు'లో శారద

## సినిమా విశేషాలు

—జి.వి.జి.

**"రాణీకాసుల రంగమ్మ"**

"మే 10 నుంచి జూన్ 10 వరకు పూర్తిగా ఔట్‌డోర్‌లో ఒకే షెడ్యూల్‌లో చిత్రీకరణ జరుగుతుంది," అన్నారు అనిల్ ప్రొడక్షన్స్ వారి అయిదవ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు నిర్వహించే టి. ఎల్. వి. ప్రసాద్. చిరంజీవి, మోహన్ ప్రసాద్, జగ్గయ్య, రాళ్ళపల్లి, దీప, జయమాలిని ముఖ్య పాత్రధారులు. దాసం గోపాలకృష్ణ, చక్రవర్తి, వేటూరి, దేవరాజ్, తోట, కణ్ణన్, కృష్ణాజీ, వడ్లమూడి ప్రసాద్, ఐ. కృష్ణమూర్తి తెరవెనుక కృషి చేస్తున్నారు. ఏప్రిల్ 5న తొలిపాట రికార్డు చేయబడింది. "జూలై నెలలో రిలీజ్ చేస్తాం," అన్నారు నిర్మాత తాతినేని ప్రకాశరావు.

**మాధవీ చిత్ర**

ఎన్. రామచంద్రరావు దర్శకత్వంలో యర్రా శ్రీదేవి నిర్మించే చిత్రం మే 20 నుంచి జూన్ 15 వరకు హైదరాబాద్‌లోని వివిధ స్టూడియోలలో చిత్రీకరించబడుతుందని సమర్పకుడు, కథకుడు గిరిబాబు చెప్పారు ఆయనతోపాటు శరత్‌బాబు, గుమ్మడి, ప్రభ, నిర్మల, సురేంద్ర పాల్గొంటారు. అప్పలాచార్య మాటలు, పాటలు రాశారు. రమేష్‌నాయుడు, విజయ్, రంగారావు, కందస్వామి, శ్రీనివాస్ తెరవెనుక కృషి చేస్తారు.

# గోకుల్
# శాండల్‌వుడ్ ఫేస్‌పౌడర్‌తో పరిమళం మోచుట్టూ గుబాళిస్తుంది!

పరిమళ రహస్యము చౌర్య నిరోధకము!
గోకుల్ శాండల్‌వుడ్ ఫేస్‌పౌడర్, ఇప్పుడు
దొంగిలించడానికి ఆస్కారంలేని ప్యాకింగ్.




మోసగాళ్ళు నకిలీ సరకును అమ్ముతారనే భయం ఇంక వుండనే వుండదు. ఎందుకంటే ప్యాక్ లోపల సీలు చేయబడి వుంటుంది. మీరు వుపయోగించుకోడానికి ముందు సీళ్ళుతీసి మరీ వుపయోగించుకోవాలి.

దయచేసి లోవలి సీళ్ళు సరిగా వున్నాయో లేదో గమనించండి. సీళ్ళు తీసివుంటే పౌడర్ నకిలీదై వుండవచ్చు.



## గోకుల్
శాండల్‌వుడ్ పౌడరు.

IS:3959

CM/L.NO.8223

టి. యస్. ఆర్. & కో., మద్రాసు.

- ఐయస్ఐ (ISI) వారి విశిష్ట గుర్తును గెలుచుకున్న భారతదేశపు మొట్ట మొదటి పౌడర్.






ADWAVE/TSR/1292 TEL



'మోసగాడు'లో శ్రీదేవి

## అంతం కాదిది ఆరంభం

ఈశ్వరీ చిత్రవారి ''కాళరాత్రి'' ద్విభాషా చిత్రం విడుదలకు సిద్ధంగా ఉంది. తదుపరి చిత్రం ''అంతం కాదిది ఆరంభం'' దీన్నికూడా తెలుగు తమిళ భాషల్లో ఆగస్టు నుండి ప్రారంభిస్తారు. ''రాజకీయ పదవీ వ్యామోహపరులు తమ స్వార్థానికి విద్యార్థులను పావులుగా ఉపయోగించుకుంటూ — నాయకత్వం కోసం ఉద్యమాలు సృష్టించి, యువతను ఎలా పెడత్రోవ పెట్టిస్తున్నారో, చివరికి యువశక్తి ఒక్కటై - దుష్ట రాజకీయ స్వార్థపరులకు ఎలా బుద్ధి చెప్పి కనువిప్పు కలిగిస్తుందో అనే ఇతివృత్తం ఆధారంగా సంచలనం కలిగించే సామాజిక చిత్రం,'' అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే పి. చంద్రశేఖరరెడ్డి. రచన : భీశెట్టి లక్ష్మణరావ్. ''కాళరాత్రి'' చిత్రానికి పనిచేసిన యూనిట్టే ఈ కొత్త చిత్రానికి కూడా పని చేస్తుందని తెలియజేశారు నిర్మాతలు పి. బలరామరెడ్డి, జి. రెడ్డిశేఖర్

## గోలనాగమ్మలో మాల చేసిన గోల

ముగ్గుబుట్టలాంటి విగ్గు పెట్టుకొని మాల (కవిత) ముసలిదానిలా ఓ పెద్దకారులో కూర్చొని ఉంది రవి (నరసింహరాజు) ఒక డొక్కు కారులో వచ్చినవాడల్లా సడన్‌బ్రేక్ వేసి, దిగాడు వృద్ధనారి వేషంలో ఉన్న మాలను పోల్చుకోలేక "ఏమండీ! ఈ కారు మీదేనా?" అన్నాడు

"అవును, నాయనా! నేనే డ్రయివ్ చేసుకొచ్చాను," అంది మాల వణికే కంఠంతో.

"మీరా!"

"ఏం? ముసలిదాన్ననుకుంటున్నావా? నీకు పెళ్ళయిందా?"

"ఏం? మీకు పెళ్ళిగాని ఆడపిల్లలెవరైనా ఉన్నారా?"

"నాకు పిల్లలా? ఇంకా పెళ్ళే కాలేదు"

"ఓహో! అసలెవరినైనా ప్రేమించారా, మామ్మగారూ?"

"ప్రేమించకేం? ప్రేమించాను కాని, ఈ మగజాతి ఒక రోగం ఆడది తనంత తానే వలచి వెంటబడితే, కస్సుబుస్సుమంటూరు ఎగిరెగిరి పడతారు"

"అదే ప్రేమ, మామ్మగారూ!"

"నీవు ఎవరినైనా ప్రేమించావా, నాయనా?"

"ఇప్పుడు మంచి పట్టులో ఉంది మా ప్రేమ మాల అని ఒక కంగిన ఇంటి బిడ్డ పిల్ల మంచిదే కాని, పొగరుపోతు ఆ పొగరు అణవాలి అందుకే 'ఛ ఛ' అని కస్సుబుస్సుమని అదరగొడితే, కాళ్ళ మీదకొస్తుంది"

"అయ్యో, పాపం! ఇంతకీ, ఆ పిల్లని చేసుకుంటావా?"

"చేసుకోక ఛస్తానా? కాని, కాస్త బెట్టుచేసి, ఏడిపిస్తేగాని .." అని రవి అంటూండగా మాల తలమీది విగ్గు పడిపోయింది ఆమెను గుర్తుపట్టిన రవి ఉక్రోషంతో "ఆ! నువ్వా? ఎంత మోసం" అంటూ పోబోయాడు "రవీ! రవీ!" అంటూ మాల వెంటబడి ఎంత బతిమాలినా రవి వెళ్ళిపోసాగాడు చివరికి మాల 'హా!' అని అరిచింది రవి గాభరాతో ఆగి, వెనుతిరిగి, ఇటు అటు చూశాడు ఒకచోట మాల పడివుంది ఆమె తలమీద ఎర్రగా రక్తం రవి 'మాలా!' అని పిలిస్తే, జవాబు లేదు రవి తన జేబురుమాలును నీళ్ళతో తడిపి తెచ్చేసరికి మాల అక్కడ లేదు రవి నిర్ఘాంతపోయాడు

'ఇంతలో ఒకచోటనుంచి మాల పాట అందుకుంటుంది,'' అన్నారు డైరెక్టర్ పి వి రాజు

కొండేపూడి సుబ్బారావు, తలాటం వెంకటేశ్వరరావు నిర్మాతలుగా కె వి జి కె రెడ్డి సమర్పించే రైన్‌బో సినీ ఆర్ట్స్ "గోలనాగమ్మ" చిత్రానికి నిర్వహణ బాధ్యతలు వహించే హాస్యనటుడు కె కె. శర్మ "కాకినాడ, లక్ష్మీనరసింహపురం, రామచంద్రపురం, కడియం, ద్రాక్షారామ," పరిసర ప్రాంతాలలో మొదటి షెడ్యూల్ పూర్తి చేసినట్లు చెప్పారు మే నెలలో జరిగే చివరి షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది సత్యనారాయణ, నాగభూషణం, సారధి, కె వి చలం, ధమ్, మాడా, జయమాలిని గోకిన రామారావు, చిట్టిబాబు, పొట్టి వీరయ్య, సూర్యచంద్రరావు, పొట్టి ప్రసాద్, పి జె శర్మ, సి హెచ్ కృష్ణమూర్తి ప్రభృతులెందరో నటించారు డి వి నరసరాజు సంభాషణలకర్త చక్రవర్తి సంగీత దర్శకుడు పి దేవరాజ్ ఛాయాగ్రాహకుడు

'పరోపకారి పాపన్న'లో కె విజయ



ప్రతి ఏడాది వస్తుంది వేసవి.
ఈ వేసవి తెచ్చింది విమల్ ట్రాపికూల్
సూటింగ్‌ను.



is the registered trademark of Reliance Textile Industries Ltd.

# విమల్ వారి ప్రత్యేక సృష్టి

# ట్రాపికూల్

## భారతదేశంలోని మొట్టమొదటి ట్రాపికల్ వర్‌స్టెడ్ సూటింగ్.

### వర్‌స్టెడ్ దారం: భారతదేశంలోని అత్యంత అధునాతన స్పిన్నింగ్ ప్లాంట్ లో ఉత్పాదన.

రిలయన్స్ టెక్స్‌టైల్స్ వారిచే 18.5 కోట్ల రూపాయల పెట్టుబడితో నెలకొల్పబడిన అత్యంత ఆధునికమైన స్పిన్నింగ్ ప్లాంట్‌లో తయారు చేయబడిన వర్‌స్టెడ్ దారంలో ఎన్నో ప్రత్యేకతలున్నాయి.

వాటిలో ఒకటి: ఆప్టికల్ ఎలక్ట్రానిక్ క్లియరింగ్ డివైస్. దీని వల్ల అత్యుత్తమ లక్షణాలు గల దారం లభిస్తుంది.

మరొకటి: అత్యంత ఆధునికమైన టెస్టింగ్ లేబొరేటరీ. ఇక్కడ వర్‌స్టెడ్ దారం అనేక పరీక్షలకు గురై అంతర్జాతీయ ప్రమాణాలు గలిగినప్పుడే పాస్ చేయబడుతుంది.

### వర్‌స్టెడ్ సూటింగ్‌కు వర్‌స్టెడ్ దారం:

ఒక్క విమల్ ట్రాపికూల్ సూటింగ్ మాత్రమే (ఈ తరగతికి చెందిన సూటింగ్స్‌లో) వర్‌స్టెడ్ దారంతో తయారు చేయబడింది.

దీని వల్ల ట్రాపికూల్‌కి ఎక్కువ మన్నిక, మృదుత్వం ఆదిగా గల లక్షణాలు లభించాయి.

### ట్రాపికూల్ సూటింగ్: భారతదేశంలోని అత్యంత ఆధునికమైన టెక్స్‌టైల్ మిల్లు ద్వారా

రిలయన్స్ టెక్స్‌టైల్స్ వారి క్రొత్త పరిశోధనల ఫలితమే ట్రాపికూల్. మన దేశ వాతవరణానికి సరిపడేలా తయారు చేయబడిన ఏకైక సూటింగ్—ట్రాపికూల్.




# అద్వితీయ విమల్

అంతర్జాతీయ శైలి. మీకో సరిక్రొత్త అనుభూతి.

**శంకరాపురాణం**

'శంకరాభరణం' చిత్రం చూశాక సావిత్రి ఎవ్వరితోనూ మాట్లాడకుండా తిన్నగా ఇంటికి వెళ్లిపోయిందట. ఆ రాత్రంతా ఏడుస్తూనే ఉండిపోయిందట. మర్నాటి ఉదయం డైరెక్టర్ కె. విశ్వనాథ్ ఇంటికి ఫోనుచేసి, ఆయన శ్రీమతితో ఈ విషయం చెప్పిందట. సావిత్రి అక్క శ్రీమతి మారుతి, శ్రీమతి విశ్వనాథ్ క్లాస్‌మేట్‌లు.



'నాగ నాగమ్మ'లో కవిత



'పున్నమి నాగు'లో రతి →

## ఆపద్బాంధవులు - తేలు కుట్టిన దొంగ

రాత్రి...కటిక చీకటి... ఆపద్బాంధవులు పలుగురూ మునసబు భూషయ్య ఇంట్లో జరుగుతున్న కుంభకోణం ఏమిటో తెలుసుకోవాలని వచ్చి, తలోక చోటా నక్కి కూర్చున్నారు. భూషయ్య వరండాలో పడుకొని, మనుమరాలు జ్యోతికి కథ చెప్తున్నాడు. ''అనగనగా ఒక ఊళ్ళో ఓ మునసబు ఉన్నాడు. ఆ ఊళ్ళో మకుటం లేని మహారాజుగా ఉంటున్నాడు,'' అని కథ ప్రారంభించి, ''బాగా పలుకుబడి, డబ్బు ఉన్న ఆ మునసబు ఇంటికి దొంగతనం చెయ్యాలని ఒక దొంగవచ్చి, పిట్టగోడ ప్రక్కన చేరాడు. అక్కడే ఒక తేలు చేరింది...దొంగనెప్పుడు కుడదామా అని తేలు చూస్తోంది... మునసబు ఎప్పుడు పోతాడా అని దొంగ చూస్తున్నాడు...మునసబు లేచాడు. దొంగ లేచాడు. తక్కున దొంగకాలును తేలు కుట్టేసింది...' అని జ్యోతికి చెప్పే కథ ముగించే సమయానికి తేలు కుట్టిన దొంగ [పిడకల గూడు దగ్గర నక్కి కూర్చున్న కిష్టయ్య] కెవ్‌మని అరిచాడు. దాంతో పనిమనిషి ''దొంగ దొంగ!'' అని గావుకేకలు పెట్టింది. దొంగల గుట్టు బయట పడింది.

వై. ఈశ్వరరెడ్డి కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో ఛాయాగ్రాహకుడు వి. ఎస్. ఆర్. స్వామి పూర్తిగా గ్రామీణ వాతావరణంలో నిర్మించిన శ్రీ అపర్ణా మూవీస్ ''ఆపద్బాంధవులు'' చిత్రంలో శ్రీధర్, శారద, చక్రపాణి, గీత, పద్మనాభం, రాళ్ళపల్లి, సాక్షి రంగారావు, ముక్కు, ఎర్రంనేని చంద్రమౌళి పాల్గొన్నారు. పరుచూరి, సత్యం, డి. వెంకటరత్నం, శీను, సరస్వతీ కుమార్ మాటలు, సంగీతం, కూర్పు, నృత్యాలు, సహ దర్శకత్వం నిర్వహించారు.

## స్వప్న

దాసరి నారాయణరావు మాటలు, పాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో గంధమనేని జగదీశ్ చంద్రప్రసాద్ తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో నిర్మించే ''స్వప్న'' చిత్రం రెండవ షెడ్యూల్ ఏప్రిల్ 20 నుంచి మే 2 వరకు నెల్లూరుకు తూర్పుగా 25 కిలోమీటర్ల దూరంలో ఉన్న తాళ్ళపూడి గ్రామంలో జరిగింది. జయప్రద సోదరుడు విజయ్, రాంజీ నాయకులు. రీనా, డాలీ, రాగిణి నాయికలు. పి. జె. శర్మ, తాట్ల శ్రీరాములు, జవ్వాది రామారావు, అత్తిలి లక్ష్మి, జయవాణి, రాధాకృష్ణ, తమిళంలో కె. ఎ. చలం, అత్తిలి లక్ష్మి, కన్నడంలో ఆదోని లక్ష్మి పాత్రధారులు. పాలగుమ్మి పద్మరాజు కథకుడు. సత్యం, కె. ఎస్. మణి, బాబు, శ్రీనివాసరాజు, తార, రాధాకృష్ణ, వినయకుమార్ సాంకేతికవర్గంతో గంధమనేని రమేష్ చంద్రప్రసాద్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. శ్రీ లలితా ఎంటర్‌ప్రైసెస్ పతాకంలో నిర్మాణం.

## ''పార్వతీ పరమేశ్వరులు''

ఎస్. భావనారాయణ సమర్పణలో పై చిత్రాన్ని గౌరీ కంబైన్స్ నిర్మిస్తుంది. సత్యనారాయణ, చిరంజీవి, జానకి, ప్రభ, కవిత, శరత్‌బాబు ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. గొల్లపూడి, సత్యం, రావుశ్రీ, ప్రకాష్ వగైరా సాంకేతిక బలంతో దర్శకత్వం నెరపే ఎం. ఎస్. కోటారెడ్డి ''జూన్ 9న సెట్స్‌కు వెళ్తున్నాం'' అన్నారు.



'సీతారాములు'లో మోహిని, జయప్రద



### డైరెక్టర్ బాలచందర్!

"మీ చిత్రం విడుదలయ్యే రోజున మీ అనుభూతులు ఎలా ఉంటాయ్?" అని అడిగితే, "పరీక్ష ఫలితాలను ఎదురు చూసే విద్యార్థి మనోభావాల్లా ఉంటాయి," అని కొందరు దర్శకులన్న విషయం తెలిసిందే కాని, డైరెక్టర్ కె బాలచందర్ మాత్రం కాస్త రొమాంటిక్‌గా "పడక గదిలోకి అడుగుపెట్టే నవ వధువు మనోభావాల్లా ఉంటాయి" అని చమత్కరించారు నవ్వుతూ

## రాం - రాబర్ట్ - రహీం లో తండ్రికి తారసపడ్డ తనయుడు

అదో కాలనీ ఆ కాలనీలోని తన ఇంటి ఎద్దకు జగదీశ్ (జగ్గయ్య) వెళ్లాడు "అదే కాలనీ అదే ఇల్లు ఏమీ మారలేదు మారిందల్లా నేనూ, నా జీవితమే ఈ ఇంట్లో ఒకప్పుడు నిరుపేదనైనా ఎంతో ఆనందంగా జీవితం గడిపాను ఇప్పుడు కోరిన సంపద ఉంది కాని, ఏం లాభం? నాతో పాటు సుఖ సంతోషాలు పంచుకునే భార్య బిడ్డలు లేకపోయారు కదా" అని అనుకుంటూ ఆ ఇంట్లోకి వెళ్లాడు ఆదే సమయానికి ఎక్కడ్నుంచో వచ్చిన రామ్ [రజనీకాంత్] ఆ ఇంటినీ, పరిసరాలనూ చూసేసరికి— అతనికేదో స్ఫురించింది వెంటనే లోపలికి వెళ్లాడు ఇటు అటు చూశాడు ఒకచోట తవ్వి, తుప్పుపట్టిన పాత పిస్టల్‌ను బయటకు తీశాడు అదంతా కుతూహలంతో, అదో ఆనందంతో గమనిస్తున్న జగదీశ్ చివాలున రామ్ దగ్గరికి వచ్చాడు "ఈ పిస్టల్ ఇక్కడుందని నీకెలా తెలుసు?" అని అడిగాడు





'రాజాధిరాజా'లో సుమలత

ఇరవై రెండేళ్ళ క్రితం ఆగస్ట్ 15 - స్వతంత్ర దినం నాడు మా నాన్నగారు నాకిచ్చిన బహుమతి ఈ పిస్టల్ తమ్ముడికి తెలియకుండా నేనే ఇక్కడ దాచిపెట్టాను అయినా, ఈ సంగతి మీరెందుకడిగారు?" అన్నాడు రామ్

"పిస్టల్ గుర్తుంది గాని, పిస్టల్ ఇచ్చిన తండ్రిని గుర్తుపట్టలేక పోయావా, శివరాం?"

"శివరాం! అంటే, మీరు"

"నీ తండ్రి జగదీశ్"

"నాన్నా"

"శివా!" అని కొడుకును హృదయానికి హత్తుకొని, "భగవంతుడు నా మొరాలకించాడు నిన్నే నాకు దక్కించాడు శివా! నీతో పాటు నీ తమ్ముళ్ళను వదిలిపెట్టి వెళ్లాను వాళ్లేమయ్యారు?" ఆత్రుతతో అడిగాడు జగదీశ్

"ఇద్దర్లో ఒకడు – రహీమ్‌ను ఈ రోజే కలుసుకున్నాను అవును ఇప్పుడు వాడి పేరు రహీమ్ ఈ ఇంటి అడ్రసు తన తల్లి ఇచ్చిందని చెప్పాడు అంటే అమ్మా, వాడూ క్షేమంగా ఉన్నట్లే కదా?"

"అయితే, మరో తమ్ముడు?"

"వాడి సంగతే తెలీదు"

విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కృష్ణ సమర్పించే పద్మావతీ ఫిలింస్ "రాం రాబర్ట్ రహీం" చిత్రం కృష్ణ జన్మదినోత్సవ సందర్భాన విడుదలవుతుందని చెప్పారు నిర్మాత ఉప్పలపాటి సూర్యనారాయణబాబు తెరవెనుక మహారథి, సి నా రె, ఆత్రేయ, ఆరుద్ర వేటూరి, సాహితి, చక్రవర్తి, పుష్పాల గోపీకృష్ణ, కొండవీటి రామలింగేశ్వరరావు, ఆదుర్తి హరనాథ్, బాబు, శేషు, బర్ల కిశోర్, భావనారాయణ, పద్మనాభం కృషి చేశారు

## కృష్ణంరాజు - బాపులతో తొలి తెలుగు 70 ఎం ఎం చిత్రం

హీరో కృష్ణంరాజు సమర్పణలో హాస్య నటుడు సారథి నిర్మించే చిన్నికృష్ణా మూవీస్ తొలి 70 ఎం ఎం చిత్రానికి ముళ్ళపూడి వెంకట రమణ రచయిత, సత్యం సంగీత దర్శకుడు, వి ఎస్ ఆర్ స్వామి ఛాయాగ్రాహకుడు, బాపు దర్శకుడు

# తారలకు తార

"మామిడికాయ పచ్చడి అంటే ఇష్టం లేనిదెవరికి?
'ప్రియ' మామిడికాయ పచ్చడి అంటే
నాకు మరీ మరీ ఇష్టం." ...జయప్రద

ఇంట్లో చేసినంత జాగ్రత్తగా-స్వచ్ఛమైన నూనె, మేలైన మసాలాలు తగుపాళ్ళతో మేళవించి చేసిన 'ప్రియ' మామిడికాయ పచ్చడి రుచిని మీరెంతో అభిమానిస్తారు.

మీరు కోరే పలురకాల్లో
•మామిడికాయ•నిమ్మకాయ•టమాటో•అల్లం•గోంగూర.

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

**ప్రియ ఫుడ్స్** ప్రైవేట్ లిమిటెడ్
పోరంకి, కృష్ణాజిల్లా.

Marketed by
**Margadarsi Marketing** PRIVATE LIMITED




KIRON/PF/807

## సినిమా

### ఎం జి ఆర్. చిత్రం మే విడుదల

చాల కాలం తర్వాత ఎం జి ఆర్ నటించిన ''ఇదు దాన్ ఎన్ బదిల్'' (నా జవాబిదే) చిత్రం మే 15న విడుదల కానున్నట్లు ఆయనే తెలియ జేశారు శాసన సభలో ఉండవలసిన ఆయన సత్యా స్టూడియోస్‌లో పగటిపూట షూటింగ్‌లు, రాత్రిళ్ళు పార్టీ మీటింగ్‌లతో ఈ మధ్య చాలా బిజీగా ఉండిపోయారు - ఎలెక్షన్‌ల హడావిడిలో ఆ చిత్రంలో నటించడానికి ముందు కమలహాసన్, రజనీకాంత్ నటించిన కొన్ని సినిమాలు చూశారట ఎం జి ఆర్ సత్యా స్టూడియోస్‌లోకి ఇతరుల నెవ్వరినీ రానియ్యకుండా బయట గేటు వద్ద తగిన కట్టుదిట్టాలు చేయించి, లోపల ఎం జి ఆర్ చిత్రం షూటింగ్ జరిగింది మరో విషయం సాధారణంగా స్టూడియోలలోని ఫ్లోర్లకు నెంబర్ లుంటాయి కాని, పేర్లు ఉండవు సత్యా స్టూడియోస్‌లో మాత్రం ఒక ఫ్లోర్‌కు స్వర్గీయ శాండో చిన్నప్ప దేవర్ పేరు, మరో ఫ్లోర్‌కు తమిళ నటుడు కీ॥ శే॥ కె ఆర్ రామస్వామి పేర్లు పెట్టారు

### కెమెరా గుండా చూడని డైరెక్టర్ హిచ్‌కాక్

''స్పెల్ బౌండ్, సైకో, రియర్ విండో'' వగైరా చిత్రాలకు అద్వితీయంగా దర్శకత్వం నెఱపిన సస్పెన్స్ మాస్టర్ సర్ ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ ఏప్రిల్ 29న లాస్ ఏంజెల్స్‌లో తన 80వ ఏట నిధనులయ్యారు హిచ్‌కాక్‌ను చివరి సారిగా ఒక పత్రికా కర్త ఇంటర్‌వ్యూ చేయడానికి కలుసుకుంటే, 'త్వరగా అడగండి మీ ప్రశ్నలు నేనిక ఆట్టేకాలం బతకను అంతవరకు నాకు ప్రతి క్షణం ఎంతో ముఖ్యం,'' అన్నారట 'ఒకే ఒక ప్రశ్న అడుగుతాను,'' అంటూ ఆ విలేఖరి 'సాధారణంగా ప్రతి డైరెక్టరూ మూవీ కెమెరా వ్యూఫైండర్ గుండా చూస్తున్నట్లు ఎన్నో ఫోటోలు చూశాను మీలాంటి పోజు ఇచ్చిన స్టిల్‌ను నేనెప్పుడూ చూడ్లేదు ఎంచేత ?'' అన్నాడట దానికి హిచ్‌కాక్ నవ్వుతూ ఇచ్చిన సమాధానం 'తీయవలసిన షాట్ ఏ రేంజ్‌లో ఏ విధంగా ఉండాలో నేను ముందే రూపకల్పన చేసుకుంటానా ? ఆ విధంగా తీయమని కెమెరా మన్‌తో చెప్తాను దానికి తగ్గ కోణాలు, లెన్స్‌లు అతను చూసుకుంటాడు అతని పనితనం మీద నమ్మకం ఉండబట్టే కదా అతన్ని కెమెరామన్‌గా నియమించుకున్నది ? కరెక్ట్‌గా నేను ఊహించిన విధంగానే అతను తీస్తాడు ఇంతలో నేను కెమెరా వ్యూ ఫైండర్ గుండా చూడవలసిన అవసరమే ముంది ? వ్యూ ఫైండర్‌గుండా చూడకుండానే ఆ షాట్ ఏ విధంగా ఉంటుందో ఇక్కడ కూర్చునే ఊహించవచ్చునే ఆ ఊహ లేనివాడు ఏం డైరెక్టరు ?''

పైన 'రామ్ రాబర్ట్ రహీమ్'లో అల్లు, హలం; కింద 'చుక్కల్లో చంద్రుడు'లో జయ, శ్రీధర్

### శోభకు కించిత్తు క్షోభ కలిగించిన విషయం

నటి శోభ బలవన్మరణం పొందడానికి కారణాలేవైనా – ఒక విషయం మాత్రం ఆమెకు కాస్త బాధ కలిగించింది ''అత్యుత్తమ నటిగా అఖిల భారత అవార్డు పొందడం–బాలు మహేంద్రతో నా వివాహం జరిగిన వేళావిశేషమని ఆనందించాను కాని, ఓ విషయం నాకు కాస్త బాధ కలిగించింది నాకు అవార్డు తెచ్చిన 'పసి' చిత్రం 100వ రోజు పోస్టర్ని చూసి కొందరు మిత్రులు మావారిని వేళాకోళం చేశారట వారుకూడా ఆ పోస్టర్‌ని చూసి బాధపడ్డారు ఒకరోజు షాపింగ్‌కువెళ్ళినప్పుడు నేనుకూడా ఆ పోస్టర్ చూశాను ఆ చిత్రంలో నేను గర్భిణిగా నటించినప్పటి స్టిల్ వేసి, నా కడుపు ఎదురుగా '3వ నెల' అని అచ్చు వేయించారు పత్రికా ప్రకటనల్లో కూడా అలాగే ఉంది నా జీవితానికి, ఆ చిత్రానికి పోలిక ఉంది గనుక ఆ చిత్రాన్ని చూడమని నేను అహ్వానిస్తున్నట్లు – కింద నా పేరు కూడా వేయించారు ఇది ఎవరి మిశ్‌ఛీఫో మరి !'' అని వాపోయిందట 

# జన్మజన్మల అనుబంధం

## జొంగుంట రామచంద్రమూర్తి

వేణుగోపాలస్వామి నిలువెత్తు విగ్రహం — ఎదురుగా మెరుస్తూ కనిపించింది... చేతిలో మురళి... మెడలో బొగడపూల దండ ... ఆ చూపుల్లోని అందాన్ని — ఆ పెదాలపై విరు దరహాసాన్నీ తాను ఎన్నిసార్లు చూశాడో — అక్కడి గంటను తాను ఎన్నిసార్లు మ్రోగించాడో ?...

కానీ—

ఇప్పుడు స్వామి కళ్ళల్లోకి చూస్తుంటే — భానుమూర్తికి అమ్మ చూపులే కనిపిస్తున్నాయి. అక్కడి గంటను మ్రోగిస్తుంటే అమ్మ పిలుపులే వినిపిస్తున్నాయి.

"అమ్మా ..!" అస్పష్టంగా అనుకున్నాడు.

తనూ, అమ్మా ఎన్నిసార్లో గుడికి వచ్చేవారు. అమ్మతో కలసి తాను ఎన్నిసార్లో గుడిచుట్టూ ప్రదక్షిణలు చేశాడు.

అవన్నీ మళ్ళీ ఇప్పుడు కళ్ళకు కట్టినట్టుగా— ఒకటొకటే గుర్తుకు వస్తున్నాయి.

అంతలోనే—గోపాలం కర్పూరాన్ని వెలిగించి— గంటను మ్రోగిస్తుంటే — ఆ మధురమైన సవ్వడికి—తన ఆలోచనల నుంచి తేరుకొని— కనుకొలకుల్లో నిలిచిన కన్నీటిని తుడుచుకున్నాడు భానుమూర్తి.

"ఏమిటి భానూ !... పాత రోజులు జ్ఞాపకానికి వస్తున్నాయా ?" హారతి తెచ్చిన గోపాలం— భానుమూర్తి పరిస్థితిని గమనించి అడిగాడు.

"లేదు గోపాలం !... అమ్మ జ్ఞాపకానికి వచ్చింది !"

"అవును ! నాకూ గుర్తుంది !— మీ అమ్మగారూ నువ్వూ—ప్రతి గురువారం గుడికి వచ్చేవారు. అప్పుడు నేనూ ఇక్కడే వుండేవాడ్ని !"—

"నాన్నగారు పోయిన తరువాత అమ్మకి దేవుడంటే భక్తి మరీ ఎక్కువయింది. రెండు రోజులకొకసారైనా గుడికివచ్చి గంటల తరబడి ఈ దేవుడి ముందు కూర్చునేది '... అలా ఎందుకు కూర్చుండి పోయేదో ఇప్పుడు అర్థమవుతోంది గోపాలం !"—

"ఎందుకంటావ్ ?" ఆసక్తితో అడిగాడు గోపాలం.

"నాన్నలేని ఒంటరి జీవితం గడపలేక, త్వరగా తనను కూడా నాన్న దగ్గరకు తీసుకపొమ్మని స్వామిని ప్రార్థించటానికే అయి వుంటుంది ! అందుకే... అందుకే నాన్న పోయిన తరువాత పట్టుమని పదినెలలయినా నిండకముందే అమ్మకూడా వెళ్ళిపోయింది" - భానుమూర్తి కళ్ళు వర్షించాయి.

"కృష్ణాష్టమి వచ్చిందంటే — మీ అమ్మగారికి ఎంత సందడో! ఎర్రటి పట్టుచీర కట్టుకుని నుదుట అర్ధరూపాయంత కుంకుమ బొట్టు పెట్టుకుని — తెలతెల వారుతూండగానే గుడికి వచ్చేవారు. ఆ పండుగనాడు స్వామికి ముందుగా, హారతిని మీ అమ్మగారు ఇవ్వవలసిందే!"

గోపాలం ఇంకా ఏమిటేమిటో చెబుతున్నాడు. భానుమూర్తి శూన్యంలోకి చూస్తూ గతాన్ని గుర్తు చేసుకుంటున్నాడు

ఆ గతంలో — నాన్నా, అమ్మా, గుడీ, నారాయణాచార్యులుగారూ, కృష్ణాష్టమి పండుగా, అమ్మ మాటలూ, స్మశానం, మంటలూ, ఏడుపులూ - ఓదార్పులూ— అన్నీ అస్పష్టంగా చోటుచేసుకుంటున్నాయి.

అంతలో అక్కడకు ఎవరో దర్శనానికి వచ్చారు.

"మళ్ళీ కలుసుకుందాం !" — గోపాలంతో చెప్పి గుడిలోంచి బయటకు వచ్చాడు భానుమూర్తి.

శీతాకాలపు చలిగాలి వుండివుండి సన్నని వణుకు పుట్టిస్తోంది. ఎదురుగా వున్న రావిచెట్టు ఆకులు గాలికి కదులుతూ వల్పటి శబ్దం చేస్తున్నాయి. ఆ రావిచెట్టుకి ఎడం ప్రక్కన శిథిలావస్థలోవున్న చిన్నపాకలో మినుకుమినుకు మంటూ దీపం వెలుగుతోంది.

ఆ పాకలో ఒకప్పుడు రామదాసు తాత వుండేవాడు. పగలు బడిదగ్గర జంగిడీ పెట్టుకుని జంతికలూ, చేగోడీలూ అమ్మేవాడు. రాత్రిళ్ళు గుడి అరుగుమీద కూర్చుని తత్వాలు పాడేవాడు.

"ఇప్పుడు రామదాసు తాత వుంటున్నాడో లేడో ?"—

తన భుజంమీద నున్న శాలువాను మెడ

---

**జరిగిన కథ – 1 :** చిన్నతనంలోనే తన తల్లిదండ్రులను కోల్పోయి, ఉన్న వూరు వదలి హైద్రాబాద్‌లో తన అక్కదగ్గరుంటున్న భానుమూర్తి, ఇల్లు అమ్మకం విషయంమీద తిరిగి ఆ వూరు వస్తాడు. అక్కడి ప్రదేశాలను చూస్తుంటే అతనికి గత స్మృతులు జ్ఞప్తికి వస్తూంటాయి.

---

**( గత సంచిక తరువాయి )**

నిండుగా కప్పుకుంటూ అప్రయత్నంగానే అటువైపు నడిచాడు భానుమూర్తి ... తలుపు తెరిచే వుంది... లోపలకు చూశాడు... కుక్కి మంచంలో రామదాసు తాత పడుకుని వున్నాడు.

"తాతా.. !" పిలిచాడు

బదులు రాలేదు. రెండోసారి మరింత గట్టిగా పిలిచాడు. మంచంమీద పడుకున్న రామదాసు తాత ఇబ్బందిగా కదిలాడు.

"ఎవరు బాబూ ?"— నూతిలోంచి వచ్చినట్లున్నాయి తాత మాటలు.

"నేను తాతా ! భానుమూర్తిని...రంగనాథం గారి అబ్బాయిని. చిన్నప్పుడు బళ్ళో చదువుకునే రోజుల్లో నీ దగ్గర చేగోడీలు కొనుక్కునేవాణ్ని. గుర్తులేదూ ?"—

"అవును బాబూ ! కొనుక్కునే వుంటావ్ ! ఇప్పుడు పెద్దతనం వచ్చేసిందినాకు. ఏమీ గుర్తుండటంలేదు. చూపుకూడా సరిగ్గా ఆనటంలేదు!"—

"అప్పుడు నువ్వు గుడి అరుగుమీద కూర్చుని పాటలు కూడా పాడేవాడివి ! నేనూ, మన కరణంగారి అబ్బాయీ వచ్చి నీ పక్కనే కూర్చుని వినేవాళ్ళం !" — తనను పరిచయం చేసుకోవాలనే కుతూహలం భానుమూర్తి మాటల్లో వినిపించింది.

"అవునవును బాబూ ! జ్ఞాపకం వస్తోంది... ఓసారి నేను, తంబురా తీగ తెగిపోయిందని చెప్పినా వినకుండా — లేకపోయినా ఫరవాలేదు — పాడమని బలవంతం చేశావ్—నువ్వేగదూ !"—

"అవును తాతా !" భానుమూర్తి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"ఏమిటో బాబూ... ఇన్నేళ్ళుగా కోరుకుంటున్నా నాకీ చెర విడిపించటంలేదు ఆ స్వామి... చూపు ఆనదు... మాట వినిపించదు... ఈ కుక్కి మంచంలో ఎన్నాళ్ళిలా బ్రతకాలో బోధపడటం లేదు బాబూ !"—

తాతవైపు పరిశీలనగాచూశాడు భానుమూర్తి. ముఖమంతా ముడతలు పడిపోయింది. కళ్ళల్లో జీవంలేదు.

'మరి నిన్ను చూడటానికి ఇక్కడ ఎవరున్నారు తాతా ?" అడిగాడు.

"ఆ దేవుడే !"

"నేనడిగేది అదికాదు. నీకు ఎలా గడుస్తోందీ అని !"

"గడవటానికేముంది బాబూ ! వేణుగోపాలస్వామి చల్లగా చూసినంతవరకూ, ఆ గోపాలం బాబు చల్లగా వున్నంతవరకూ నాకు ఏ లోటూరాదు... రోజూ ఇంత ప్రసాదం పంపిస్తూంటాడు. అసలు ఆ ప్రసాదం తింటూండ బట్టే — నేనింతకాలం ఇలా బ్రతికి వున్నానా అనిపిస్తుంది బాబూ !"— జీవంలేని తాతకళ్ళల్లో కన్నీరు తొంగి చూసింది.

"తాతా ! ఒక్కసారి ఆ పాట పాడతావా?"— అడిగాడు.

"పాటా ? ఏం పాటదాబూ ?"

"అదే ! బంధాలు మూణ్నాళ్ళు – అంటూ పాడుతూండే వాడివి గుర్తులేదూ... అదీ !"

"నీకింకా ఎంత జ్ఞాపకం బాబూ! పాడతాను. ఇన్నేళ్ళ తరువాత మళ్ళీ నువ్వు అడిగినందుకైనా పాడతాను"

భానుమూర్తి లేచివెళ్ళి మూలనున్న తంబురాను తెచ్చి తాతకు అందించాడు

"దీని అవసరం ఈ జన్మకు మరి రాదనుకున్నాను మళ్ళీ నాచేత శ్రుతి వేయించావ్" — తంబురాను అందుకుని, సంతృప్తి నిండిన కళ్ళతో భానుమూర్తి వైపు చూశాడు

తాతకు ఎదురుగా స్తంభాన్ని ఆనుకుని కూర్చున్నాడు భానుమూర్తి.

తాత పాట ప్రారంభించాడు

"బంధాలు మూణ్ణాళ్ళ
అనుభూతి చాన్నాళ్ళ
మనసెందుకిచ్చావు సామీ...
ఈ మమతెందుకిచ్చావు సామీ
మట్టిలో చేసేసి ఆడుకుంటావు.
మట్టిలో కలిపేసి ఊరుకుంటావు
మధ్యలో ఇస్తావు
మా కెన్నో బంధాలు..
పెంచుకొను వేళలో
తెంచి పారేస్తావు.."

తన్మయత్వంతో తాత పాడుతుంటే కళ్ళు మూసుకుని విన్నాడు భానుమూర్తి

"బాగా పాడావ్ తాతా! మళ్ళీ చాలా ఏళ్ళ తర్వాత నీ పాట వినగలిగాను" — అంటూ అక్కడ నించి లేచాడు.

"వెడుతున్నావా బాబూ?" — తంబురాను మంచానికి ప్రక్కనే ఆనుస్తూ అడిగాడు తాత

"మరి పొద్దుపోయింది. .వెడతాను తాతా!" — రెండడుగులు ముందుకు వేసిన భానుమూర్తి ఆగి— వెనక్కి చూశాడు ఏదో గుర్తుకు వచ్చినవాడిలా మళ్ళీ వెనక్కి వచ్చి తన భుజంమీదనున్న శాలువాను తీసి తాత భుజాలమీద కప్పాడు

"ఇదేమిటి బాబూ?"

"శాలువా తాతా! చలికాస్తుంది...వుంచు!" అంటూ, ఆ పాకలోంచి ఇవతలకు వచ్చి ఇంటివైపు నడిచాడు భానుమూర్తి.

హాలులో కూర్చుని పుస్తకం చదువుతున్న సుధ భానుమూర్తి రాకను గమనించి లేవబోయింది

"ఫరవాలేదు. కూర్చో సుధా!" — అన్నాడు, తనుకూడా అక్కడ వున్న మరో కుర్చీలో కూర్చుంటూ

"మంచి నీళ్ళు కావాలా?" అడిగింది సుధ

"వద్దులే!" —

అంతలో, వంటగదిలోంచి శ్యామలాంబగారు కూడా వచ్చి అక్కడే గడపదగ్గర గోడనానుకుని కూర్చున్నారు

"నీ చదువయి పోయిందా?" — అడిగారావిడ.

"బి ఏ పోయింది. ప్రయివేటుగా చదువుతున్నాను"





## అనుభూతి - అనుబంధం

"మీ అక్కయ్య ఆరోగ్యంగా వుంటోందా? పిల్లలు ఎందరేమిటి?"

చెప్పాడు భానుమూర్తి.

"మీ చిన్నక్కయ్యలు ఎక్కడుంటున్నారు?" మళ్లీ ప్రశ్నించారు శ్యామలాంబగారు.

ఆ ప్రశ్నకు కూడా సమాధానం చెప్పి - ఇంక ఆవిడ ఎలాంటి ప్రశ్నలు అడగటానికి అవకాశం వుందో - వాటికి సంబంధించిన వివరాలు కూడా చెప్పేశాడు.

"ఏమోయ్! ఊళ్లోకి వెళ్లి వచ్చావా? అలా సత్రంవైపు వస్తావేమో అనుకున్నాను" అంటూ లోపలకు వచ్చారు కరణంగారు. శ్యామలాంబగారు లేచి వంటింట్లోకి వెళ్ళిపోయారు.

లాల్చీ జేబులో వున్న కళ్ళజోడు తీసి అక్కడి బల్లమీద పెట్టి కుర్చీలో కూర్చున్నారాయన.

"ఇందాకా షావుకారికి కబురు పెట్టాను రేపువచ్చి మాట్లాడుతానన్నాడు" - అన్నారు.

ఎదురుగా గోడకున్న కేలండర్‌లోకి చూస్తూ వుండి పోయాడు భానుమూర్తి.

"మా వూరి సత్రంలో కార్తీక పురాణం చెబుతున్నారు రోజూ వెడుతున్నాను. మాధవరావుగారు కూడా వస్తున్నారు. నువ్వు వచ్చావని చెప్పాను" కరణంగారు కొంతసేపయ్యాక అన్నారు.

అప్పుడుగానీ భానుమూర్తికి గుర్తు రాలేదు— తాను చదువుకున్న ఎలిమెంటరీ స్కూలు హెడ్ మాస్టారి పేరు మాధవరావ్ గారని!

"మాధవరావ్‌గారు ఈ ఊళ్లోనే వుంటున్నారా?" - అడిగాడు.

"అవును! కాలువ దగ్గర చిన్న ఇల్లు కట్టుకున్నారు. పాపం, ఈ మధ్య ఆయనకు పక్షవాతం కూడా వచ్చింది. రేపొద్దున్న ఓసారి వెళ్ళి ఆయనను పలకరించిరా. ఆయనకూ నిన్ను చూడాలని వుందట!" - కరణంగారన్నారు.

"కాళ్లు కడుక్కుని భోజనానికి లేవండి! పొద్దుపోతోంది!" - వంటింట్లోంచి శ్యామలాంబ గారు పిలవటంతో ఇద్దరూ లేచారు.

### 3

"నమస్కారం మాస్టారూ!" —

భగవద్గీత చదువుతున్న మాధవరావు గారు తల ఎత్తి చూశారు.

"నువ్ భానుమూర్తివి కదూ?"— క్షణం సేపు తేరిపార చూసి అడిగారు. తరువాత అతను సమాధానం చెప్పేలోగానే —

"అమ్మాయ్! భానుమూర్తి వచ్చాడు. కాస్త కాఫీ తీసుకురాతల్లీ" - అంటూ లోపలకు వినిపించేలా కేకవేశారు.

మాధవరావుగారి మంచం దగ్గరగావున్న స్టూలు మీద కూర్చున్నాడు భానుమూర్తి.

'నిన్ననేవచ్చాను మాస్టారూ! వస్తూంటే దారిలో ఇదివరకు మీరున్న ఎత్తరుగుల ఇల్లు

సూపర్ మాన్'లో ఒక దృశ్యం

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దినపత్రిక పెట్టింది పేరు... మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

## కల'వరం'

వెలుగుతప్ప వేరేదీ చూడనని భీష్మించుకున్న నా కళ్ళు
అన్నార్తుల ఆకలిమంటలు చూడలేక అలమటించే నా కళ్ళు
అబలల మానభంగాలను చూసి భరించలేక బావురుమనే నా కళ్ళు
అంధుల చీకటి బ్రతుకుల నాదుకోలేక విలపించే నా కళ్ళు
దుర్మార్గుల దురంతాలకు దుఃఖించే నా కళ్ళు
వేరేదీ వీక్షించాలని కోరుకోవు వెలుగు తప్ప!
కానీ, మబ్బుల్లా కళ్లని కమ్మేస్తుంది మగత —
మగతలో పుడుతుంది 'కల' —
కష్టాలను చూసి చూసి విసుగెత్తిన కళ్ళకి పండగ — 'కల'
ఇష్టాలకు రూపమిచ్చి మురిపించే 'మాంత్రిక' — 'కల'
వేదనతో విసిగిపోయిన కళ్లకి 'టానిక్కు' — 'కల'
ఆవేదనతో అలిసిపోయిన కళ్ళకి 'పిక్‌నిక్కు' — 'కల'
వాస్తవం విసిగి కలను కోరుకుంటుంది —
కల చెదిరి వాస్తవాన్ని చేరుకుంటుంది —
కల'వరం'తో కళ్ళు ముందుకు నడుస్తాయి —
కలవరం తగ్గి కాలాన్ని చూడగలుగుతాయి !!

— శారదా అశోకవర్ధన్

కనిపించింది కానీ మీరు ఈ ఊరు నుంచి ట్రాన్స్‌ఫరయి వెళ్ళిపోయుంటారను కున్నాను రాత్రి కరణంగారు చెప్పారు — మీరిక్కడే వుంటున్నారని !'' — అభిమాన పూరకంగా అన్నాడు భానుమూర్తి

'అవునోయ్ భానూ ! జీవితంలో చాలా ముఖ్యమైన వాటిని ఈ ఊళ్లోనే పోగొట్టుకున్నాను అందుకే, పోయిన వాటి జ్ఞాపకాలయినా దొరుకుతాయని— ఈ ఊళ్ళోనే వుండిపోయాను !'' —

మాధవరావు గారి మాటలు భానుమూర్తికి అర్థంకాలేదు .

''ఇక్కడ ఉద్యోగం చేస్తూనే రిటైరయ్యాను ఇక్కడే పక్షవాతంతో కాలులేనివాడినయ్యాను ఈ ఊరి మట్టిలోనే నా భార్యను బూడిద పాలు చేశాను... .. ఇక్కడే '' — ఆగిపోయారు మాధవరావు గారు

ఆయన వైపు జాలిగా చూస్తూండి పోయాడు భానుమూర్తి.

అంతలోనే కాఫీ తీసుకొచ్చింది సీతామహాలక్ష్మి

''కాఫీ తీసుకో భానూ !'' — అన్నారు మాధవరావుగారు — గ్లాసు అతని చేతికి అందించి వెళ్ళిపోయింది సీతామహాలక్ష్మి

''విశ్వనాథం ఇప్పుడు ఎక్కడ వుంటున్నాడు మాస్టారూ ?'' — కాఫీ తాగుతూ అడిగాడు

''పెట్లో'' —

తాగుతున్న కాఫీ గుటక పడక — గొంతులోనే ఆగిపోయింది అయోమయంగా చూశాడు ఆయన వైపు

''కాలవలో ఈత కొట్టవద్దని మిమ్మల్ని కేకలేసేవాణ్ని . గుర్తుందా ?'' —అడిగారాయన

### అనుభూతి - అనుబంధం

''ఔను ! ఓసారి నేనూ, విశ్వనాథం బడినుంచి కాలవకు వెళ్ళి ఈత కొడుతుంటే మీరొచ్చి మమ్మల్ని కేకలేశారు . విశ్వనాథాన్ని కొట్టారు కూడా !'' —

''నిజమే ! కొట్టాను కానీ వాడంటే నాకు ప్రేమలేదనీ — వాడు ఈత నేర్చుకోకూడదనీ కాదు కొట్టింది.. ! ఆ నీళ్ళల్లో ఎప్పటికయినా వాడు కొట్టుకు పోతాడేమోనని భయం వేసి !''—

అదంతా ఎందుకు చెబుతున్నారో భానుమూర్తికి అర్థం కాలేదు కాఫీగ్లాసును అలాగే ఒక చేత్తో పట్టుకుని — మరోచేత్తో దాని అడుగు రాస్తూ వుండి పోయాడు.

మళ్లీ మాస్టారే అన్నారు

''మా విశ్వం పుట్టినప్పుడు జాతకం రాయించాము. వాడికి జలగండం వుందని ఆ జాతకంలో రాసివుంది... అందుకే వాణ్ని నీళ్లకు దూరంగా వుంచాలని ఎప్పటికప్పుడు ప్రయత్నిస్తూ వచ్చాము కాని ఏం లాభం ? . ఆ దేవుడు రాసిన రాతను మనం దూరం చేయగలమా చెప్పు ?''—

ఏదో జరగరాని ఘోరం జరిగే వుంటుందని భానుమూర్తికి అనిపించింది.

మాధవరావు గారు మళ్లీ చెప్పసాగారు.

''ఓ సారి శివరాత్రికి సముద్ర స్నానం చేయటానికి స్నేహితులతో కలసి కాకినాడ వెళ్లాడు. నాకు ముందుగా తెలిస్తే అప్పుడుకూడా వెళ్ళొద్దని, కాళ్లూ చేతులూ కట్టి ఇంట్లో కూర్చోబెట్టేవాణ్ని!... కానీ, నాకు తెలియకుండా వెళ్లాడు. వెళ్ళినవాడు మరి తిరిగిరాలేదు. తిరిగివచ్చిన వాడి స్నేహితులు చెప్పారు — విశ్వం ఇక తిరిగిరాడని !...'' కళ్ళజోడు తీసి పైమీది కండువాతో కళ్ళు తుడుచుకున్నారు మాస్టారు

''ఏడేళ్ళ వ్యవధిలో మేస్టారి సంసారం ఎంత చిన్నాభిన్నమైపోయింది ? ఈ జ్ఞాపకాల కోసమేనా మేస్టారు ఈ ఊళ్లోనే వుండిపోయింది! . అసలు జ్ఞాపకాలనేవి మనిషి జీవితాంతం — తోడురావల్సిందే తప్పదు !.. కానీ చేదుజ్ఞాపకాలకు దూరంగా పారిపోవాలనే ప్రయత్నిస్తారు ఎవరైనా అలాంటిది ఆ జ్ఞాపకాల కోసమే మేస్టారు ఇక్కడ వుండిపోయారంటే వాటితో ఆయనకున్న అనుబంధం ఎంతటి బలీయమైనదో అనిపిస్తుంది''—తలచుకుంటున్నకొద్దీ భానుమూర్తి మనసంతా దిగులుతో నిండిపోయింది ఏం మాట్లాడటానికీ అతని గొంతు పెగల్లేదు అక్కడి వాతావరణమంతా భయంకరంగా తోచింది

ఇక అక్కడ వుండలేక బయటకు వచ్చేశాడు.

ముందు రాత్రి తాత పాడిన తత్వంలోని భావం, అప్పుడే ఆ క్షణంలోనే అర్థమయినట్లు అనిపించింది భానుమూర్తికి.

''పాపం . మాస్టార్ని చూస్తే జాలేసింది!''— అన్నాడు భోజనాలదగ్గర

కరణంగారు నిట్టూర్చి —

''నిజమేనోయ్... ఆయన బాగా బ్రతికిన రోజుల్లో ఎంతోమందిని ఆదుకున్నాడు ఇప్పుడు చితికిపోయిన తరువాత, ఆయనకు మాటసాయం చేసేవాళ్లుకూడా లేకపోయారు'' — అన్నారు

భానుమూర్తి మౌనంగా వింటున్నాడు

''అప్పుడు నువ్ బాగా చిన్నవాడివి... గుర్తులేదేమో ! . మీ అమ్మగారు పోయినప్పుడు, మాధవరావుగారే దగ్గరుండి అన్నీ జరిపించారు. కుడిచేత్తో ఖర్చుచేసింది ఎడంచేతికికూడా తెలియనివ్వలేదు ! ఇప్పుడు కూతురి పెళ్లి చేయటం సమస్యగా పరిణమిస్తే — నిస్సహాయుడై చూస్తున్నాడు...' —

''సంబంధాలు ఏమైనా చూస్తున్నారా వాళ్ళమ్మాయికి ?'' —

''మేనరికమే వుంది !.. కానీ కనీసం వెయ్యి రూపాయలైనా కట్నం ఇవ్వనిదే లాభంలేదన్నారట... ఆయనకు వచ్చే పెన్షన్ డబ్బులతో రోజులు గడవటమే కష్టంగా వుంటోంది ఇంక కట్నాలేం ఇవ్వగలుగుతాడు చెప్పు ?. పోనీ మేం సహాయపడదామంటే — ఆయనకు వల్లమాలిన అభిమానం''—

''గోరుచుట్టుమీద రోకటిపోటులా, భార్య పోయిన దుఃఖంనుంచి కోలుకోకుండానే, చేతికందిన ఒక్క కొడుకూ నీటిపాలయ్యాడు ఆ మనోవ్యాధికి సాయం పక్షవాతం కూడా రావాలా ?'' — నెయ్యి వేస్తూ, శ్యామలాంబగారు అన్నారు.

విశ్వనాథాన్ని గురించిన జ్ఞాపకాలు ఆవేదనను కలిగిస్తూంటే అన్నం హితవు కాలేదు భానుమూర్తికి ... మజ్జిగ పోసుకోకుండానే చేయి కడిగేసుకున్నాడు ...

# హార్లిక్స్
## మీకు ఎక్కువగా అవసరమయినప్పుడు శక్తినిచ్చే కీలకపోషక పదార్థం.










### గర్భవతిగా ఉన్న కాలంలో

గర్భిణీ స్త్రీకి మంచి సమతూకంలో ఉండి, తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం అవసరం. అందువల్లనే గర్భిణీగా ఉన్నప్పుడు హార్లిక్స్ ఆదర్శప్రాయమయిన ఆహారం. ఇది తల్లికి, పిల్లకి కూడా శరీర నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు, కార్బొహైడ్రేట్లు సరిఅయిన సమతూకంలో సమకూరుస్తుంది. రాత్రిళ్ళు సేవించిన మలబద్ధకం ఉండదు. ఉదయమే నిస్సత్తువగా ఉండటం పోతుంది.

### అస్వస్థత / అస్వస్థనుంచి కోలుకునే కాలంలో

జబ్బు చేసినప్పుడు మీ శరీరం ఎంతో విలువయిన మాంసకృత్తులు, పోషక పదార్థాలు కోల్పోతుంది. దీనివల్ల నిస్సత్తువ ఏర్పడుతుంది. ఈ నష్టాలను భర్తీ చేసేందుకు హార్లిక్స్ తేలిగ్గా జీర్ణమయ్యే రూపంలో శరీర కణాల నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు. శక్తినిచ్చే కార్బొహైడ్రేట్లు ఖనిజాలు సమకూరుస్తుంది దీనివల్ల మీరు త్వరగా కోలుకొంటారు. మళ్ళీ జబ్బు పడకుండా తట్టుకునే శక్తి ఏర్పడుతుంది.

## ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేశారు
## హార్లిక్స్ మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్

Hx 4559 Tel 1

ఆ సాయంత్రం టౌను నుంచి షావుకారు వచ్చాడు

"పెరట్లోవున్న కొట్టుగదిని మాత్రం నేను అమ్మదలుచుకోలేదు" – అన్నాడు భానుమూర్తి

"ఆ ఒక్కగదీ అట్టేపెట్టుకోవటం ఎందుకూ?" – అడిగారు కరణంగారు

"అందులో రామదాసు తాత వుంటాడు." భానుమూర్తి మాటలు విన్న కరణంగారు ఆశ్చర్యంగా చూశారు

"నిన్న రామదాసు తాతని చూశాను ... బాగా పెద్దవాడయిపోయాడు..! పాపం.. శిథిలావస్థలో వున్న ఆ పూరిపాకలో ఎలా వుంటున్నాడా అనిపించింది అందుకే ఇంక బతికినంతకాలం ఆ గదిలో వుండమంటాను" —

భానుమూర్తి ఔదార్యానికి అడ్డుచెప్పలేక పోయారు కరణంగారు ..

ఆయన మధ్యవర్తిత్వంలో – తన ఇల్లు అయిదువేలకు అమ్ముడయిపోయింది ... ఇంటితో బాటు ఆ వూరికీ తనకూ కూడా ఋణం తీరిపోయింది. వుట్టిపడ దుఃఖం గొంతుకి అడ్డం పడుతూంటే –

"ఇక నేను వెడతాను ... శలవిప్పించండి"– అని ఎలాగో అతి కష్టంమీద అనగలిగాడు భానుమూర్తి

"వచ్చి నాలుగు రోజులయినా కాలేదు అప్పుడే తొందరేమిటి? రేపో ఎల్లుండో వెళ్ళచ్చులే!" – అన్నారు శ్యామలాంబగారు

"వచ్చినపని అయిపోయింది కదండీ! ఇంక నాకిక్కడ ఏముందని?" – జేబురుమాలుతో కళ్ళు తుడుచుకున్నాడు

"అదేమిటోయ్...మేమంతా లేమా? ఇల్లు పోయినంతమాత్రాన అనుబంధాలూ, ఆత్మీయతలూ పోతాయా? నువ్వెప్పుడువచ్చినా ఈవూరు నీవూరే! మేమంతా నీవాళ్ళమే!"– భానుమూర్తి పరిస్థితిని గమనించిన కరణంగారు ఓదార్పు ఉట్టిపడే స్వరంతో అన్నారు

ఆ రాత్రి భానుమూర్తికి నిద్ర పట్టలేదు ... మంచంమీద అసహనంగా అటూ ఇటూ కదులుతూనే వున్నాడు...

ఓ రాత్రివేళ ...

చీకటంతా నిశ్శబ్దంలో నిద్రపోతున్నవేళ తనకెదురుగా ఎవరో కదలినట్లయితే – ఉలికిపడి చూశాడు భానుమూర్తి ..

"ఎవరదీ?" – ఖంగారుగా అడిగాడు.

"నేనే!"

ఆ గొంతును సులువుగానే పోల్చుకున్నాడు... చివాలున మంచంమీదనుంచి లేచి స్విచ్ వేశాడు గదంతా వెలుతురు పరచుకుంది ..

"నువ్వా సుధా .. ఇంత రాత్రివేళ. ఏమిటిదీ?"–ఆదుర్దాగా అడిగాడు భానుమూర్తి

"నువ్ రేపే వెళ్ళిపోతున్నావా?" – అతని కళ్ళల్లోకే తమకంగా చూస్తూ అడిగింది సుధ...

"అవును...వెళ్ళాలనే అనుకుంటున్నాను"

"మరి" ఏదో చెప్పబోయిన సుధ ఏమీ చెప్పలేక నేలచూపులు చూస్తూ నిలబడిపోయింది

"ఏమిటి సుధా? అసలు ఏం జరిగింది?"– ఆమెకు దగ్గరగావస్తూ అడిగాడు.

"నువ్ నన్ను పెళ్ళి చేసుకుంటావా?" – అతని కళ్ళల్లోకే సూటిగా చూస్తూ చటుక్కున అడిగింది సుధ.

భానుమూర్తి త్రుళ్ళిపడ్డాడు

"చెప్పు భానూ! నువ్ నన్ను పెళ్ళి చేసుకుంటావా?" – మళ్ళీ రెట్టించింది

ఆమె మాటల్లో ఆతృత, కళ్ళల్లో భయం గూడుకట్టుకున్నాయి

"ఇంత హఠాత్తుగా నన్ను నిలవేసి ప్రశ్నిస్తే నేనేం చెప్పగలుగుతాను? అయినా పెళ్ళి చేసుకునే వుద్దేశ్యం నాకిపుడు లేనేలేదు!"

"కానీ ఎప్పుడో ఒకప్పుడు ఎవరినో ఒకర్ని పెళ్ళి చేసుకోక తప్పదు ... ఆ చేసుకునేదేదో – ఇప్పుడే – నన్ను చేసుకొమ్మని అడుగుతున్నాను"–

సుధ అంత ధైర్యంగా మాట్లాడుతుందని భానుమూర్తి ఎప్పుడూ అనుకోలేదు కానీ అంత రాత్రివేళ సమయంలో–తనదగ్గరకు వచ్చి తనను అలా అడుగుతోందంటే – దానికేదో బలమైన కారణం వుండితీరాలి.

"చూడు సుధా! నువ్ నాదగ్గర ఏదో విషయాన్ని దాస్తున్నావ్. ఉన్నపాటున ఇలా నువ్వు అడగటం నాకు ఆశ్చర్యంగా కూడా వుంది" అన్నాడు.

"మరేంలేదు భానూ!. నాకు పెళ్ళి చేయాలని అమ్మా, నాన్నా తొందరపడుతున్నారు... ఏవేవో సంబంధాలు తీసుకొస్తున్నారు —"

"అయితే మాత్రం భయమెందుకూ?"

"మనిషి అందంగా వున్నాడని తీరా పెళ్ళి చేసుకుంటే – రేపెప్పుడో అతను చెడ్డవాడని తెలిస్తే? అందుకే తెలియనివారితో కాపురం చేసేకంటే – చిన్నప్పటినుంచీ స్నేహితుడవైన నిన్ను చేసుకుంటే ధైర్యంగా వుంటుందనీ"

## మాస్కోలో 250 సార్లు 'రామాయణం'

మాస్కోలోని కేంద్ర బాలల థియేటర్‌లో 'రామాయణ' నాటకం 250వ సారి ప్రదర్శింపబడింది భారతీయ పౌరాణిక కావ్యం 'రామాయణం' ఆధారంగా నటాల్యా గుసేవా రచించిన యీ నాటకం సోవియట్ యూనియన్‌లో నేటికి 20 సంవత్సరాలుగా ప్రదర్శింపబడుతూ వుంది ఈ నాటక ప్రదర్శన రజతోత్సవం సందర్భంగా జరిగిన వేడుకలో యీ నాటక రచయిత్రి నటాల్యా గుసేవా, సోవియట్ యూనియన్‌లోని భారత రాయబార కార్యాలయ ప్రతినిధులు పాల్గొన్నారు. ఈ నాటక రచనకు ఈమెకు జవహర్లాల్ నెహ్రూ అవార్డు లభించింది ఈ సందర్భంగా భారత రాయబార కార్యాలయ ప్రతినిధి శ్రీ మెహ్రోత్రా ప్రసంగిస్తూ యీ నాటక బృందం కృషికి కృతజ్ఞత ప్రకటించారు.

సుధ మాటలు విన్న భానుమూర్తికి నవ్వాగలేదు

"భలేదానివి సుధా! అదన్నమాట నీ భయం!" –

"అవును భానూ! నా స్నేహితురాలు గిరిజ లేదూ? పెద్దకాపుగారి అమ్మాయి!... ఆ పిల్లకి మంచి సంబంధం తెచ్చి చేశారు అబ్బాయి పెద్ద చదువు చదివాడు బోలెడంత ఆస్తి కూడా వుంది చాలా అందంగా వుంటాడు కానీ ఏం లాభం?. కాపరానికి వెళ్ళిన ఆర్నెల్లకే గిరిజ ఆత్మహత్య చేసుకుంది"–

"ఎందుకని?"

"అతనితో కాపురం చేయలేక! అతనికి లేని వ్యసనమంటూ లేదు. ప్రతిరోజూ తాగివచ్చి గిరిజను ఎందుకో ఒకదానికి చావగొట్టేవాడట ఎవరెవరో ఆడాళ్ళను తెచ్చి ఇంట్లో పెట్టుకుని– గిరిజ ఎదురుగానే – వాళ్ళతో కులికేవాడట.. అతని బాధలు భరించలేక ఆత్మహత్య చేసుకుంది."

"దురదృష్టవంతురాలు! అసలు ఇలాంటివి అక్కడక్కడ జరుగుతూనేవుంటాయి సుధా అందుకే పై మెరుగుల్ని చూసి భ్రమపడకూడదని పెద్దవాళ్ళు చెబుతూంటారు .. మంచి స్నేహితుణ్ణని, నన్ను పెళ్ళి చేసుకున్నా – తీరా రేపు నేను చెడ్డవాణ్ణి కాకూడదని గ్యారంటీ ఏమిటి?. మంచివాళ్ళు చెడ్డవాళ్ళూ కావచ్చు! చెడ్డవాళ్ళు మంచివాళ్ళగానూ మారచ్చు! అయినా ఎవరికి ఎక్కడ రాసిపెట్టివుందో – ఎలా రాసివుందో, అక్కడ అలా జరక్కమానదు" – భానుమూర్తి అన్నాడు

"ఈ వేదాంతం నాకు అవసరంలేదు. నువ్ నన్ను చేసుకుంటావా లేదా. అది చెప్పు!"–

సుధ అలా నిలవేసి అడుగుతూంటే భానుమూర్తికి నవ్వొచ్చింది బాధా కలిగింది

సుధకు అపురూపమైన అందముంది అంతకుమించి అమాయకత్వమూ వుంది. తనకు ఆమెను చేసుకోవాలని వున్నా కరణంగారు మాత్రం ఒప్పుకోరు! ఆ వూళ్ళోవున్న ఆ ఇల్లు తప్ప తనకు ఆస్తిపాస్తులులేవు ఇప్పుడు ఆ ఇల్లుకూడా పరాధీనమైపోయింది. తల్లీ తండ్రీ లేరు ఉద్యోగం సద్యోగం లేదు. చదువూ సంధ్యా లేదు! ఏంచూసి తనకు సుధను ఇవ్వగలుగుతారు?

అయినా సుధ అడిగిన ప్రశ్నకు తాను జవాబు చెప్పాలి

"ఇప్పుడు నాకు ఆ వుద్దేశ్యం లేదు సుధా! అయినా నీలాంటి సుగుణాలరాసిని చేసుకునేటంత అదృష్టవంతుణ్ణి కాను నేను! రేపెప్పుడైనా నేను పెద్ద చదువులు చదివి – మంచి హోదా సంపాదించగలిగితే–అప్పుడు ధైర్యంగావచ్చి – మీ నాన్నగార్ని అడిగి మరీ నిన్ను చేసుకుంటాను"– అన్నాడు

భానుమూర్తి మాటలు విన్న సుధ అతని కళ్ళల్లోకి అసహాయంగా చూసింది ఆ తరువాత తల వంచుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది.

(ఇంకా వుంది)

ధర్మపథం

# ముఖ్యమైన మూడు వైదిక మతాలు

వేదాలను ప్రమాణంగా గ్రహించి ఏర్పడిన మతాలలో ద్వైతా ద్వైత విశిష్టాద్వైత మతాలు ముఖ్యమైనవి. వీటిలో అద్వైతాన్ని శంకరులు, విశిష్టాద్వైతాన్ని రామానుజులు, ద్వైతమతాన్ని మధ్వమునులు స్థాపించారు. ఈ మూడు మతాల వారూ జీవాత్మను, పరమాత్మను వివరించారు. ప్రతి ప్రాణియందునూ ఉన్న ఆత్మ జీవాత్మ. విశ్వవ్యాప్తమైనది పరమాత్మ. దానినే పరబ్రహ్మమని అంటారు.

జీవాత్మ ఎన్నో కష్టాలను అనుభవిస్తుంది. అనుభవించే సుఖాలు భ్రాంతి మూలకములే కాని యధార్థాలు కావు. జీవాత్మ ఆనందస్వరూపమైన పరమాత్మలో ఐక్యం కావడమే ముక్తి. అది సులభసాధ్యం కాదు. దానికోసం మహర్షులు ఘోరమైన తపస్సు చేస్తూ ఉంటారు.

ఈ జీవాత్మ, పరమాత్మలకు గల సంబంధములోనే అభిప్రాయ భేదాలు కలిగినందువల్ల మూడు మతాలు ఏర్పడినవి. ఎన్నో సాధనల మూలంగా జీవాత్మ పరమాత్మలో ఐక్యం చెందుతుంది. అదే మోక్షమని అద్వైత మత అభిప్రాయం. అద్వైతం అంటే రెండుగా ఉండకపోవడం— ఒకదానిలో మరియొకటి కలిసిపోవడమన్న మాట! విశిష్టాద్వైతులు, జీవాత్మ అపూర్వ సాధనవల్ల పరమాత్మ సారూప్యాన్ని పొందుతుందనీ, పరమాత్మలో పూర్తిగా ఐక్యం కాదనీ చెప్తారు. వీరి మతంలో అద్వైత భావం ఉన్నా, అందులో కొంత విశిష్టత ఉందన్న మాట! వీరి మతంలో ముక్తి భక్తితోనే కలుగుతుంది. ఐక్య భావం ఉండదు

మధ్య మతంలో జీవాత్మ పరమాత్మలకు ఐక్య భావం కలుగదు. జీవునికి పరమాత్మ సారూప్యమూ ఉండదు. ఈ రెండాత్మలూ వేరువేరుగానే ఉంటాయి. ద్వైతమంటే భేదభావమన్నమాట! భగవంతునితో కలిసి ఉండడమే మోక్షం దీనికి భక్తియే పరమ సాధనం. స్థూలంగా ఈ మతత్రయ స్వరూపం యిది. సామాన్యులు సులభంగా గ్రహించవలసినది.

ఈ మతాలలో "అహం బ్రహ్మాస్మి" అనే విషయాన్ని బోధించే అద్వైతమతమే తక్కిన రెండింటి కంటె ఎక్కువ వ్యాప్తిలో ఉన్నది. విశిష్టాద్వైతం ఉత్తర భారతంలో తక్కువగాను, దక్షిణ భారతంలో ఎక్కువగాను ఉన్నది. ద్వైత మతానికి దక్షిణ ప్రాంతంలోనే ప్రచారం ఎక్కువ

— బులుసు వేంకటరమణయ్య

# గడ్డిపరకలు

(18వ పేజీ తరువాయి)

అంతెంత బంగళా. ఇంత ఇల్లు ఏం చేసుకుంటారా? గెస్ట్ రూమ్‌లు, ఔట్ హౌసులు అబ్బా ఎన్ని గదులో! ఎంత మంది మనుష్యులున్నారో అనుకున్నాడు కాని తరువాత తెలిసింది. ఆ ఇంట్లో భార్య భర్త ఒక బాబు అని ... తరువాత ... తరువాత ఎంతోమంది మారారు కాని ... ఆ బంగళా అంతా వాడినా.. వాడకపోయినా ప్రతీ గది తలుపులు, తలుపులు ఒక్కటే కాదు కిటికీలు ఆఫీసు పనివాడు క్లీన్‌చేసి ఉంచాలని.. క్రొత్తలో ఆ పని కొంచెం కష్టం అనిపించేది. ఆవక కొంచెం సిగ్గుగా ఉండేది. కాని ఆ తరువాత బియ్యంలో రాళ్ళు ఏరడం దగ్గరనుండి బట్టలు ఇస్త్రీ చేసేవరకు చివరకు పని మనిషి రానప్పుడు బట్టలుతికినా సిగ్గు అనిపించేది కాదు.

"రామయ్యా! ఏమిటలా తలుపు తుడుస్తూ ఉండిపోయావు? బట్టలు అక్కడ పెట్టాను, ఇస్త్రీ చేయ్! ఇంకా క్లీన్‌చేయుడం పూర్తికాకపోతే ఎట్లా? టైమ్ అవుతుంది. స్కూలుకి క్యారియర్ పట్టుకు వెళ్ళాలి, నేను క్లబ్‌కి వెళుతున్నాను, తాళం వేసుకొని వెళ్ళు" అని ఆర్డర్ జారీచేసి గవర్నమెంటు వారి జీపులో బయలుదేరారు ఇంజనీరుగారి భార్య.

టైమ్ తొమ్మిదవుతుంది. రామయ్య రోడ్డుమీద నడుస్తున్నాడే కాని ఆ నడకలో హడావిడిగాని టైము ఎంతయిందో అన్న ఆత్రుత, భయంగాని లేవు

పొద్దున్నుండి పార్వతి మంచం మీద స్పృహలేకుండా మూసిన కన్ను తెరవకుండా ఉన్న దృశ్యం కళ్ళముందు కనబడుతుంది.

అంత స్పృహలేకుండాఉన్నా "ఏమండీ! నేను చనిపోయినా నా పిల్లలకు ఏ లోటు లేకుండా చూడండి. తల్లి లేకపోయినా తండ్రి ఉన్నాడన్న సంతోషాన్ని కలిగించండి" అని తన చేయి గట్టిగా పట్టుకొని ఏవేవో చెబుతుంది.

పిచ్చిపార్వతి! లోటు లేకుండా చూసుకుంటాను అని మాట ఎలా ఇవ్వను? కనీసం పచ్చడి మెతుకులు ప్రక్కన కూరలో అన్నం పెట్టగలడా? పెళ్ళిళ్ళకు ఎదిగిఉన్న కూతుళ్ళను ఒక ఇంటి వారిని చేయగలడా? ఈ తండ్రి ఉన్నా ఒకటే! లేకపోయినా ఒకటే! తండ్రి ఉన్నాడన్న సంతోషాన్ని ఎలా ఇవ్వగలడు? ఆలోచనలతోనే బంగళా ప్రవేశించాడు. ప్రభాకరరావు డి. ఇ. అన్న బోర్డు, ట్రాఫిక్ పోలీసు స్టాప్ అన్న బోర్డు చూపించినట్టె. వెనక్కి అడుగు వేసాడు. తొమ్మిది దాటి ఉంటుంది టైము. ఇంజనీరు గారి భార్య ఏమంటారో అన్న భయం గుండెలో గుబులుదేరింది ఈ వేళకి అయినా అసలు రాకపోదును. స్పృహలేని పరిస్థితిలో కూడ తన చేయి ఎంతో గట్టిగా పట్టుకొని ఉన్న పార్వతి చేతిని తన చేతి నుండి విడదీయలేక పోయాడు భార్య చావు బ్రతుకుల మధ్య ఉన్నా, నా లాంటి బంట్రోతు శలవుకి కారణం చెబుదామన్నా వాళ్ళకి తెలుసుకొనే అవసరంలేదు పార్వతి అని ఏం చెప్పగలడు? అలా చెప్పలేకపోవడం వలనే ఇంత ఆలశ్యం చేసాడు. ప్రాణం పోతుందో, అది నిద్రో తెలియని సమయంలో ముప్ఫయిఏళ్ళ కాపరం కష్టాలో, సుఖాలో.. ఛ...కాదుకష్టాలతోనే కాపురం చేసిన పార్వతితో ప్రాణం విడుస్తుందో ఏమో అని లేకుండా వచ్చాడు. తన బాధ్యత పిల్లలకి అప్పగించాడు.

"రామయ్యా!"...అన్న పులి గాండ్రింపు లాంటి పిలుపుకి అదిరిపోయాడు రామయ్య. ఎప్పుడు పిల్లిలా ఇంట్లో ఉండే ఇంజనీరు గారు పులి కావడం ఆశ్చర్యం అనిపించింది.

"నువ్వు ... ఏం ఇంత ఆలశ్యంగా

వ్వావ్? శ్లేవ్ం ఇంత ఇదో అన్న ్యాసం లేకుండా, నీ ఇష్టం వచ్చినప్పుడు వస్తావా?''

'స్కూలుకి సుని, హేమని తీసుకు వెళ్ళాలని తెలియదు. ఈరోజు పనవాళ్ళు... చాలా పని ఉంది అని తెలిసి కూడ ఇలా వచ్చావంటే...'' అని ఇంజనీరు గారి ముఖంలోకి చూసింది ఇంజనీరు గారి భార్య.

ఇంజనీరుగారు దగ్గి, గొంతు సవరించుకొని "మరోసారి నువ్వు ఇలా వస్తే... డిస్మిస్ చేస్తాను''

రామయ్య డిస్మిస్ అన్న మాట వినగానే అదోలా అయిపోయాడు. అంతలోనే మనసు దిటవు చేసుకున్నాడు. ఇంట్లో పరిస్థితి చెప్పాలని నోరు తెరవబోయాడు. కాని అప్పటికే ఇంజనీరుగారి భార్య అక్కడనుండి లోపలికి వెళ్ళిపోయారు.

పనులన్నీ ఒక్కొక్కటి చేస్తున్నాడే కాని మనసులో పార్వతి మెదులుతూనే ఉంది. ఒకసారి ఉతికినబట్టలు దండంమీద ఉంటే అలాగా వెళ్ళిన తను బట్టలు ఆరవేయబోయాడు. 'మీరు ఎప్పుడు అలాంటి పనులు చేయకండి. నేను ఏమయ్యాను అనుకున్నారు' అంది కాని ఇక్కడ ఇంజనీరుగారి బట్టలు దగ్గరనుండి ఇంజనీరు గారి భార్య చీరలు, పిల్లల డ్రాయరులు వరకు బట్టలు ఉతకడం పూర్తి కావడంతో మామిడికాయలు తరగడానికి కూర్చున్నాడు. క్రిందటి సంవత్సరం పచ్చడికని నాలుగు మామిడికాయలు ఇంటికి తీసుకవెళ్ళాడు. కాయను మధ్యకు కోయలేక పార్వతి అవస్థ పడుతుంటే, గబాలున కత్తిపీట లాక్కొని తను కోయబోతుంటే, 'మగవాళ్ళు మీకెలా చేతనవుతుంది' అని వారిస్తున్నా తను కోయబోయాడు. రక్కున చేయితెగి రక్తం చిమ్మింది. అది చూసి కళ్ళనీళ్ళు పెట్టుకుంది పార్వతి చేయి సురుక్కుమనడంతో చేతివైపు చూసాడు. వేలు తెగి రక్తం కారుతుంది.

"ఛీ... ఛీ... రక్తం... లే... తొందరగా అక్కడనుండి లే... మామిడికాయ ముక్కకి అంటుకుంటుంది... ఆ ముక్క పారెయ్! చేయి శుభ్రంగా కడుక్కొని గుడ్డ కట్టుకొని కొయ్! అంత పరాకుగా కోస్తావు ఏమిటి? ఏం లేకపోయినా పొగరు లెక్కువ'' అని విసురుగా అక్కడ నుండి వెళ్ళిపోయారు ఇంజనీర గారి భార్య.

చేతికి కారుతున్న రక్తం గుడ్డతో తుడుచుకున్నాడు.

ఇంజనీరుగారి భార్య అక్కడకు రావడంతో "అయిపోయిందమ్మా కోసేసాను'' అని అన్నాడు.

"చూడు... నీ గురించి 'మీ పిల్ల వచ్చింది'' అన్నారు ఇంజనీరుగారి భార్య.

"మా అమ్మాయా'' అని ముందు ఆశ్చర్యపోయి తరువాత కీడు శంకిస్తున్న మనసుతో గబగబా అడుగులు వేసాడు.

సరళ కళ్ళనుండి నీళ్ళు ఏకధాటిగా కారుతున్నాయ్! "నాన్నా! అమ్మ ఇక మనకు లేదు నాన్నా... ప్రాణం వదిలేముందు కూడ నీ కోసం చూసింది... నిన్ను తలుస్తూనే ప్రాణం వదిలింది'', అంది ఏడుస్తూ సరళ.

ఆ నిముషంలో అది డి. ఇ గారి ఇల్లు అని మర్చిపోయి 'పార్వతీ' అని ఒక పెద్ద ఆర్తనాదంతో కూడిన కేక వేసాడు. వెనుతిరిగి చూడకుండా పరుగులాంటి నడక మొదలు పెట్టాడు.

తెలవారింది. డి. ఇ. బంగళా బెల్ ఏ విధమైన సంకోచం లేకుండా నొక్కాడు.

తలుపు తీసిన ఇంజనీరుగారి భార్య రామయ్యను చూసి ఆశ్చర్యపోయింది. "నువ్వు... నువ్వు ఎందుకు వచ్చావ్? శలవు కావాలన్నావు కదూ? తీసుకో!''

ఆ మాటలు ఏమీ వినిపించుకోలేదు రామయ్య. "ఇంకా ఎనిమిది కాలేదమ్మా'' అన్నాడు.

"అది కాదు నేను అంటున్నది నీ భార్య నిన్ననేకదూ చనిపోయింది. ఈ రోజే పనిలోకి ఎందుకు వచ్చావ్?'' అన్నారు ఇంజనీరుగారి భార్య

"నా భార్య అమ్మా... ఆ... చనిపోయింది నిన్న. ఈ రోజు చివరి కోసం శలవమ్మా... ఇక దినాలు, తద్దినాలు అంటారా? బతికుండగా ఒక్కనాడు శుభ్రమైన కూరతో అన్నం పెట్టలేని నేను చనిపోయాక ఎక్కడెక్కడి వాళ్ళనో పిలిచి ఆమె ఆత్మశాంతి చేస్తే ఫలితం దక్కుతుంది అనే నమ్మకం నాకు లేదమ్మా'' అని మనసులో రగులుతున్న ఆవేదన మాటల రూపంలో ఆవేశంగా అనబోయాడు గాని ఇంజనీరుగారి భార్య అన్న విషయం గుర్తు వచ్చి ఆవేశాన్ని అణచుకొన్నాడు.

మౌనంగా లోపలికి అడుగు పెడుతున్న రామయ్య వైపు ఆశ్చర్యంగా చూసింది ఇంజనీరుగారి భార్య.

* * *

బంగళా దగ్గరకు వచ్చిన రామయ్య బారులు తీరిఉన్న కారులు, జీపులు చూసి ఒక్క నిముషం ఆశ్చర్యపోయాడు. గేటు తీసుకొని లోపలికి అడుగు పెట్టాడు. ఇంటినిండా మనుష్యులు... ఖరీదైన దుస్తులలో ఒక్క మాటలో చెప్పాలంటే విలువైన మనుష్యులున్నారు.






ఇంజనీరుగారి భార్య మంచంమీద పడు కొని ఉన్నారు. ఇంజనీరుగారిని పని మీద దు రోజులు ప్రక్క ఊరు పంపడంతో ముగించుకొని ఆ రోజు సాయంకాలం

## గడ్డిపరకలు

ఐదు గంటల ట్రైన్‌లో దిగి తిన్నగా బంగళా దగ్గరకు వచ్చాడు. ఇంజనీరుగారు

స్వతహాగా కొంచెం మొహమాటం మనిషి కావటం వలన ఇచ్చిపుచ్చుకోవడాలో, మొహమాటంగా వేపార్టీ ఇచ్చేవాళ్లు వింతో కొంత అని సరి పెట్టుకుంటారు.

కాని తీరా ఇంటికి వచ్చినాక తన మోహ వాటాన్ని నింపించుకొని ఇంజనీరు గారి భార్య ఇచ్చిన "కొటేషన్" ఎవరో ఒకరి ద్వారా అవతల పార్టీ వాళకి పంపిస్తారు. ఆ పని ఎవరో ఒకరు కన్నా రామయ్య లాంటి వాడైతే రెండోవాడికి తెలియదని అటువంటి కొటేషన్స్‌కి రామయ్యను పంపిస్తారు. ఆ పని ముగించుకొని సాయంకాలం ఐదుగంటలకి బంగళా చేరుకున్నాడు.

ఒక్కొక్కరు పరామర్శిస్తున్నారు ఇంజనీరు గారి భార్యను. "ఆ...అ... థాంక్యూ సొ ఫోర్ డెస్ లీవు చాలు సార్...ఏమంటున్నారు? వారంరోజులా! అక్కరలేదుసార్! ...ఆ. అ... పరవాలేదంటున్నారా అలాగే సార్! . థాంక్యూ వెరిమచ్!...డాక్టరుగారు చూసి వెళ్ళారు... పరవాలేదు బి. పి. వలన కళ్ళు తిరిగాయి. రెస్టు తీసుకోవాలి అన్నారు ఆ ... తప్పకుండా రండి సార్! మరి నేను ఉంటానా 'సార్" అని ఇంజనీరుగారు ఫోను పెట్టేసారు.

అప్పటికి కాని అర్థంకాలేదు రామయ్యకు ఇంటినిండా మనుష్యులుండడానికి కారణం. ఇంజనీరు గారి భార్య వైపు చూసాడు. ఇంజనీరుగారు పళ్లరసం ఆమెచేత త్రాగిస్తున్నారు. కళ్ళలో పార్వతి మెదిలింది. చనిపోయే రోజున స్పృహలేని పరిస్థితిలో కూడ పార్వతి తన చేయిని ఎంత బలంగా పట్టుకొంది? బహుశ పార్వతి ప్రాణాలు తన వడిలో వదలాలి అని ఏమో!

"నమస్కారంసార్! రండి రండి" అని ఇంజనీరుగారు మాట్లాడడంతో ఆలోచనల నుండి తేరుకున్నాడు రామయ్య.

ఎదురుగా పెద్ద ఆఫీసరు గారు.

"ఎలా ఉందమ్మా ఇప్పుడు. మీరు రెస్టు బాగ తీసుకోవాలి. ప్రభాకరరావు! బి.పి.ని మామూలుగా నెగ్లెట్ చేయకూడదు. వారం రోజులు శలవు తీసుకోండి. ఇంట్లో ఉండి మీరు అన్ని వేళకు మందులు ఇవ్వండి" అన్నారు.

"అలాగేసార్" అన్నారు ఇంజనీరుగారు.

రామయ్య పని చేస్తున్నాడే కాని తనతో సంబంధం లేకుండా ఆలోచనలు ముసురుకోవడం ప్రారంభించాయి. మనసుని పిండుతున్న ఆలోచనల బాధతోనే రోడ్డుమీదకు వచ్చాడు.

చివరి క్షణాల్లో తన కోసం ఎదురు చూస్తూ ఎంత బాధతో ప్రాణాలు విడిచిందో! బాధ్యతలు తీరి, కష్టాలు ఏమిటో తెలియకుండా తన పార్వతి ప్రాణాలు విడిచిందా? ఊహు .. కాదు. బాధ్యతలు తీరకుండా, సుఖం అనేది ఏమిటో తెలియకుండా అల్లాడుతున్న మనసుతో చనిపోయింది. ఏదో... ఏదో చేయగలడు అనుకున్నాడు తను. ఏదో... ఏదో... చెప్పాలని బాధ్యతలు గుర్తుచేయాలని ఊగిసలాడుతూనే పార్వతి చనిపోయింది.

మెడలో మూడు ముళ్ళు వేసిన పాపానికి ఇంటికి తీసుకువచ్చిన తను... బ్రతికినంత కాలం బ్రతుకులో ముళ్ళు వేసి బిగించడం తప్ప, విడదీయడం చేతకాని తను చనిపోయే ముందు కూడ ఊపిరి సలపని బాధ్యతలనే ముడులతో ప్రాణాలు పోయేలా చేసాడు. ఛ... ఛ... తను బ్రతకడం వ్యర్థం.

కన్ను మిన్ను తెలియని రక్తపోటుతో నున్న భార్యని చివరిక్షణాల్లో లేకుండా, ఒక్కరోజు శలవు దొరక్క వచ్చాడు. ప్రాణాలు వదిలేముందు కూడ తను లేడని బాధతోనే పోయేలా చేసాడు. కాని పార్వతికేం తెలుసు? తను ఇక్కడ పార్వతి కోసం ఎంత బాధ పడ్డాడో? ఇంజనీరుగారిని శలవు అడగడానికి ఎంత భయపడ్డాడో!

క్రూరజంతువులను సైతం లొంగదీసుకొని మచ్చిక చేసుకున్న మానవునికి సాటి మానవుని చూసి అంతస్తులు తక్క వైవంత మాత్రాన భయపడలేదు ఎందుకో!

అంతస్తుల వ్యత్యాసం వలనే కదూ కొంచెం రక్తపోటు ఇంజనీరుగారి భార్యకు వస్తే వారం రోజులు ఇంజనీరు గారు అడగకుండానే శలవు పెద్ద ఆఫీసరుగారు ఇచ్చారు.

ఒక్కసారిహోరున గాలివేయ సాగింది పెద్ద పెద్ద చెట్లు సైతం ఊగిసలాడే గాలితో రోడ్డుమీద దుమ్ము ఎగరసాగింది.

ముందుకి అడుగులు వేయలేక ఒక్క నిమిషం నిలబడ్డాడు రామయ్య. రోడ్డుమీద గడ్డిపరకలు ఎగిరి రామయ్య పాదాల మీద పడి మరల రివ్వున గాలివీచటంతో పాదం మీద పడ్డ గడ్డిపరకలు ఎక్కడో కనిపించని చోటికి ఎగిరిపోయాయి.

ఎగిరిపోతున్న గడ్డిపరకలు చూస్తున్న రామయ్య పెదాలపై నిర్లిప్తమైన నవ్వు బయలుదేరింది.

అవును! ఆ గడ్డిపరకలు లాంటివే తన లాంటి వాళ్ళ బ్రతుకులు. గడ్డిపరకలు ఎగిరి ఎగిరి ఎక్కడికో పోయి పడినా ఎవరికి నష్టం? అసలు పట్టించుకొనే వాళ్ళు ఎవరు? ప్చ్.. లేరు... అలాగే తన బ్రతుకు ఏమైనా, తనకు ఎన్ని బాధలున్నా పట్టించుకొనే వాళ్ళు ఎవరు? ఎవరు లేరు! అందుకే తను బ్రతకడం వ్యర్థం!

గాలి తీవ్రత హెచ్చుతూనే ఉంది. రోడ్డుమీద గడ్డిపరకలు ఎక్కడికో ఎగిరిపోతూనే ఉన్నాయ్! అవును! ఆ గడ్డిపరక లాంటి వాడు తను. ఉన్నా ఒక్కటే!... లేకపోయినా ఒక్కటే! ఆ గడ్డిపరకలాగే... తను... వెళ్ళిపోవాలి... వెళిపోవాలి అని హృదయంలో రగులుతున్న బాధతో ఎదురుగుండా వస్తున్న లారీకి ఎదురుగా వెళ్ళాడు రామయ్య.

లారీ క్రింద రామయ్య! చుట్టూ రక్తపాతం!



### పుస్తకాలు చూచి పరీక్షలు :

ఇక మీద కాపీ కొట్టే ప్రసక్తే లేదు పరీక్షల్లో. పాఠ్య పుస్తకాలు చూచి విద్యార్థులు పరీక్షలు వ్రాసే పద్ధతిని ప్రవేశపెట్టాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఇక ఈనిర్ణయం అమలు కావడమే తరువాయి. ఒకటవ తరగతి నుంచి ఇంటర్ మీడియేట్ వరకు ఇంటర్నల్ అసెస్మెంటు ద్వారా విద్యార్థుల ప్రతిభను అంచనా వేసి, వార్షిక పరీక్షలో వెయిటేజి ఇవ్వాలని, మార్కులకు మారు గ్రేడు పద్ధతి పెట్టాలనికూడా ప్రభుత్వం నిర్ణయించింది. పరీక్షల సంస్కరణ గురించి ఏప్రిల్ 22న ముఖ్య మంత్రి కార్యాలయంలో జరిగిన సమావేశంలో ఈ నిర్ణయాలు జరిగాయి. విద్యా మంత్రి శ్రీ భవనం వెంకట రామరెడ్డి, విద్యాశాఖాధికారులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. విద్యాశాఖాధికారులు నివేదిక అందజేసిన మీదట, మే నెలలో మరొక సమావేశం జరుగుతుంది. వచ్చే విద్యా సంవత్సరం నుంచి అమలు కావచ్చు. పుస్తకాలు చూచి పరీక్షలు వ్రాసే పద్ధతి దేశం మొత్తం మీద కాక, మన రాష్ట్రంలో మాత్రమే అమలుపరిస్తే, ఇతర రాష్ట్రాల వారు ఇతర దేశాల వారు మన పరీక్షా ప్రమాణాలను, యోగ్యతా పత్రాలను చిన్న చూపు చూచే ప్రమాదం లేకుండా చూడాలి.

### నాగార్జున సాగర్ నీరు :

నాగార్జున సాగర్ నుంచి లభ్యమవుతున్న నీరు వాడకంతో సమస్య పరిష్కారం కావాలని, అలా కాకపోతే రాజకీయంగా పోరాటం రావచ్చునని మాజీ ముఖ్యమంత్రి, పార్లమెంటు సభ్యుడు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ఏప్రిల్21న అన్నారు. నాగార్జున సాగర్ నీటి విషయమై ప్రజా ప్రతినిధులతో, సాంకేతిక నిపుణులతో రాష్ట్ర ప్రభుత్వం సమగ్రమైన సమాలోచనలు సాగించాలని ఆయన సూచించారు. "నాగార్జున సాగర్ నీటి విషయమై మూడు

## హైదరాబాద నోట్‌బుక్

నెలల క్రితం నేను ముఖ్యమంత్రికొక ఉత్తరం వ్రాశాను. ఒక సమావేశం ఏర్పాటు చేసి నీటి వినియోగానికి తగినపథకాలు సిద్ధపరచాలని కోరాను. సాగర్ కుడి కాలువ క్రింద ఎనిమిది లక్షల యకరాల భూమి సాగుకు రావలసి ఉండగా, ఆరున్నర లక్షలయకరాలే సాగుకు వస్తున్నవని ఫిర్యాదులు నాకు అందాయి. ఆయకట్టు కిందకివచ్చిన కాలువ చివరి భూములకు నీరు అందడం లేదని కూడా ఫిర్యాదుల వచ్చాయి. రాయలసీమకు నాగార్జున సాగర్ నీరు ఇస్తామంటున్నారు. ఒక పంటకైనా నీరు ఇస్తామని హామీ యిచ్చిన దర్శి, కనిగిరి, పొదిలి ప్రాంతాలకు ఎంతనీరు ఇస్తారు ? రాయలసీమకు ఎంతనీరుఇస్తారు?" అని శ్రీ బ్రహ్మానందరెడ్డి ప్రశ్నించారు. ఎంతో ఉదాత్తాశయంతో నిర్మించిన నాగార్జున సాగర్ నీరు తెలుగు వారిలో చీలికలకు కారణం కాకుండా చూడడం ప్రతి ఆంధ్రుని విధి. నదీ జలాలు నేడు వివిధ దేశాల మధ్య ఎన్ని సమస్యలకు కారణమవుతున్నవో మనం చూస్తూనే ఉన్నాము. గంగా జలాల వివాదం దేశం స్వతంత్రం అయినప్పటి నుంచీ రావణ కాష్టంగా ఉండనే ఉంది.

### అదుపులేని ట్రాఫిక్కు :

ట్రాఫిక్ నియమ నిబంధాలు పాటించని —ఏ మాత్రమూ పాటించని—భూభాగం ప్రపంచంలో ఏదైనా ఉందంటే అది తెలుగు నాడు అని ఎలాటి పరిశోధనా లేకుండా, వెంటనే చెప్పవచ్చు. నడివీధిలో నలుగురు నిలబడి మాట్లాడుతుంటారు. లారీలు, బస్సులు తప్పుకొని పోవలసిందే కాని, వాళ్ళు కదలరు. నడివీధి దుకాణాలకు జాంబాగ్ ప్రాంతం, చిక్కడపల్లి ప్రాంతం గొప్ప లాక్షణాలు. జంటనగరాలలో రోడ్ల మీద తిరిగే లారీలు మొదలయిన వాహనాలను సోదా చేసే అధికారాలు పూర్వం హెడ్‌కానిస్టేబుల్‌కు కూడా ఉండేవి. వాటిని సబ్ ఇన్‌స్పెక్టర్లకు దత్తం చేశారు. ఇప్పుడు సర్కిల్ ఇన్‌స్పెక్టర్లకు మాత్రమే పరిమితం చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నదట. దీని వల్ల ప్రమాదాలు పదింతలు పెరిగిపోతాయేమోనని గుండెలు కొట్టుకుంటున్నాయి. ప్రస్తుతం జంట నగరాలలో వాహనాల సంఖ్య దాదాపు 60 వేలు. వీటిని సోదా చేసేందుకే ట్రాఫిక్ సిబ్బంది తగినంత లేదు. మరి కొత్త ఆలోచన వాహనాల ప్రమాదాలను ఎలా ఆపగలుగుతుందో చూడాలి.

### ఆంధ్ర బ్యాంకి జాతీయం :

ఆంధ్ర బ్యాంకుతో సహా ఆరు బ్యాంకులను కార్పొరేషన్ బ్యాంకి, న్యూ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఓరియంటల్ బ్యాంక్ ఆఫ్ కామర్సు, పంజాబ్ అండ్

సిండ్ బ్యాంక్ లిమిటెడ్, విజయ బ్యాంకు— జాతీయం చేస్తూ ఏప్రిల్ 18 రాత్రి రాష్ట్రపతి ఆర్డినెన్స్ జారీ చేశారు. ఈ బ్యాంకుల డిపాజిట్లు, డిమాండ్లు, టైమ్ లైబిలిటీలు మార్చి 4వ తేదీకి 200 కోట్లు దాటినందున వీటిని జాతీయం చేశామని ఆర్డినెన్స్‌లో వివరించారు. ఈ బ్యాంకులను జాతీయం చేయడం వల్ల దేశంలోని బ్యాంకింగ్ వ్యవస్థను అదుపులో పెట్టడానికి ప్రభుత్వానికి వీలు కలిగింది. 20 సూత్రాల పథకం సమర్థంగా అమలు కావడానికి, ప్రాధాన్య రంగాలకు ఇచ్చే అడ్వాన్సులు 40శాతానికి పెంచడానికి ఈ జాతీయకరణం తోడ్పడుతుంది. సామాజిక ఆర్థిక కార్యక్రమాలు పటిష్టంగా అమలు చేయడానికి, ఎక్కువ శాతం డిపాజిట్లను ఖర్చు చేయడానికి ప్రభుత్వానికి వీలవుతుంది. ఆంధ్ర బ్యాంక్‌కి తొలి డైరెక్టర్ల బోర్డును కేంద్ర ప్రభుత్వం నియమించింది. ఆంధ్రా బ్యాంకి ప్రస్తుతం కస్టోడియన్‌గా వ్యవహరిస్తున్న స్వామినాథరెడ్డి, ఆర్థిక మంత్రిత్వ శాఖ బ్యాంకింగ్ విభాగం సంయుక్త కార్యదర్శి శ్రీ బల్‌దేవ్‌సింగ్, హైదరాబాద్‌లోని రిజర్వు బ్యాంకు బ్యాంకింగ్ వ్యవహారాల డిప్యూటీ చీఫ్ ఆఫీసర్ శ్రీ ఎన్. ఎస్. కన్యా డైరెక్టర్లు. ఆంధ్రా బ్యాంకిని జాతీయం చేసేందుకు నష్ట పరిహారం తక్కిన బ్యాంకులకన్నా ఎక్కువే ముట్టింది.

**విశ్వశాంతి పిసీ – మాస్ :**

సమకాలిక సమస్యలను చర్చిస్తూ, సంఘంలోని చెడును తొలగించడంలో ప్రజలకు తోడ్పడడం, దైనందిన మానవ జాతి సమస్యలను చిత్రించి, వాటికి పరిష్కారం సూచించే ఉత్తమ చిత్రాలకు ఆర్థిక సహాయం చేయడం, అటువంటి చిత్రాల నిర్మాణ ప్రదర్శనాలను స్థాపించి నిర్వహించడం, ఫిలిం స్టూడియోలను స్థాపించి నిర్వహించడం, తక్కువ వ్యయంతో కావలసిన హంగులను సిద్ధపరచడం, ముఖ్యంగా లక్ష్యాలతో విశ్వశాంతి పిసీ—మాస్ అనే పబ్లిక్ లిమిటెడ్ సంస్థను నెలకొల్పనున్నట్లు శ్రీ యు. విశ్వేశ్వరరావు ఏప్రిల్ రెండవ వారంలో పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో తెలిపారు. శ్రీ విశ్వేశ్వరరావు నిర్మించిన నగ్నసత్యం చలన చిత్రానికి 1979 ప్రాంతీయ ఉత్తమ చిత్రం అవార్డు లభించింది. ఈ చిత్రానికి, తీర్పు చిత్రానికి వచ్చిన బహుమతి ధనాన్ని ఈ సంస్థకు పెట్టుబడి పెడతానని, వంద రూపాయల వాటా ధనంతో వాటాదార్లను సేకరిస్తామని శ్రీ విశ్వేశ్వరరావు ప్రకటించారు. తన ప్రధానోద్దేశ్యం ఉత్తమ నవ 'చిత్రోద్యమం' అన్నారు. సినిమాలో నష్టమనేది ఉండదని, రెండు వారాలు ఆడనా ఏ సినిమా నష్టపోదని ఆయన అన్నారు.

(58వ పేజీ చూడండి)

పాట్నాలోని ఆంధ్రా కల్చరల్ అసోసియేషన్ ఉగాది వేడుకలలో పాల్గొన్నవారు : నిల్చున్నవారు (ఎడమ నుండి కుడికి) శ్రీ ఎమ్. కె. విశ్వనాథం, శ్రీ కె. వి. ఎస్. శర్మ, శ్రీ బి. వి. రావ్, శ్రీమతి బి. మణి అప్పారావు, శ్రీమతి ఎమ్. ఎస్. ఇబ్రహీం, శ్రీ ఎమ్. ఎస్. ఇబ్రహీం, శ్రీ సి. పి. రావ్, శ్రీ సి హెచ్. రత్నరాజు, శ్రీ వై. వి. యస్. మూర్తి, శ్రీ వి. గౌరీశంకర్, శ్రీమతి వి. గౌరీశంకర్. కూర్చున్నవారు (ఎడమ నుండి కుడికి) శ్రీ కె. వి. రావ్, శ్రీ కె. అంబికా ప్రసాద్, శ్రీ కె. ఎస్. ఎన్. మూర్తి, శ్రీ ఎమ్. ఎస్. గోపీనాథ్.

# మాడిపోయిన కూర

## నండూరు సుబ్బారావు



పొయ్యి మీద కూర మాంచి సువాసన కొడుతోంది.

వడాలసిన మసాలా సమపాళ్లల్లో పడింది. బోల, తయారు చేస్తున్న నాకే నోరూరిపోతోంది.

ఇంతలో 'పోస్టు' అన్న కేక వినబడింది. ఒక్క అంగలో పోస్టుమాన్ దగ్గరకు చేరగెత్తి, అతని చేతిలో ఉత్తరం అమాంతం అందుకున్నాను. మా నాన్నకు ఈమధ్య ఒంట్లో బాగుండటం లేదన్నారు అక్కడి నుంచేనేమో! లేకపోతే పెద్దక్కయ్య కూతురు పెళ్ళికి తాంబూలం పుచ్చుకుంటున్నారో! ఇవి రెండూ కాక మరెక్కడి నుంచయినానా — అసలు ఈ ఉత్తరం నాకా? మా శ్రీవారికా? ఇన్ని ఆలోచనలు ఒక్క క్షణంలో ముసిరిరాగా కవరుమీద అడ్రసు చూశాను. చిరునామా నా పేరనే ఉంది. దస్తూరి కూడా బాగా పరిచయమున్నదే

పొయ్యిమీద కూర మాడిపోతుందేమో నన్న ఆలోచన కూడా లేకుండా గబగబా ఉత్తరం చింపి చూశాను. నా సంతోషం ఏమని చెప్పను. ఆ ఉత్తరం, నేననుకున్నట్టు మా నాన్న దగ్గర నుంచీ కాదు, పెద్దక్కయ్య దగ్గర నుంచీ కాదు. అందరినీ మించిన చిన్ననాటి నా క్లాసుమేటు, ప్రాణ స్నేహితురాలూ అయిన 'అరుణ' దగ్గర నుంచి. అన్నాళ్ళకిన్నాళ్ళకు నిజంగా అరుణను చూసినంత సంతోష మేసింది. కాలేజి వదిలిన తర్వాత దానిని చూడటమే పడలేదు. ఇవాళ ఎంత మంచిరోజు. నా సంతోషం ఏమని చెప్పను.

తనూ, తన భర్తా కలిసి వస్తున్నామని రాసింది. ఒక్క అరుణనే కాదు — అరుణ భర్తను కూడా చూడబోతున్నానన్నమాట.

మా క్లాసు స్టూడెంట్సులో అరుణను మించిన అందగత్తె లేదు. అందానికి మించిన వినయం. డిబేట్సులోనూ, సంగీతంలోనూ దానిని ఓడించాలని ఎంతో మంది ప్రయత్నించారు గాని అన్నిసార్లూ ప్రయత్నించడం మాత్రమే మిగిలిపోయి తుంకా జాయించి నట్లు అదే ఫస్టున నెగ్గుకుంటూ వచ్చేది.

నాకు బాగా జ్ఞాపకం. ఒకసారి ఇంటర్ కాలేజి కాంపిటీషన్సు అన్ని కాలేజీల మీద మ్యూజిక్‌లో దానికే ఫస్టు ప్రైజు వచ్చినపుడు మేమంతా మాకే ప్రైజు వచ్చినంత సంబరపడి దానికి పెద్ద పార్టీ ఇచ్చాము. మా కాలేజి పేరు నిలబెట్టినందుకు ప్రిన్సిపాలుగారూ, లెక్చరర్సూ, మా అరుణను పొగడుతుంటే విద్యార్థులంతా "హిప్ హిప్ హుర్రే" అని జయజయధ్వానాలు చేస్తుంటే, మధ్యలో నిలబడ్డ అరుణ సిగ్గుతో ముడుచుకుపోయి ముఖం దాచుకున్న దృశ్యం ఇప్పటికీ నాకు గుర్తే!

అరుణ ఎవరిని పెళ్ళి చేసుకుందో. క్రికెట్ ప్లేయర్నా? పెద్ద గెజిటెడ్ ఆఫీసర్నా? లేక ఏ వర్ధమాన సినిమా హీరోనా? వీరిలో ఎవర్ని చేసుకున్నా వాళ్ళు మా అరుణముందు దిగదుడుపే. మా అరుణకు నచ్చిన అతనెవరో, పెద్ద అందగాడై ఉండాలి. అతను నిజంగా అరుణకు తగ్గ అందగాడే అయితే చూడడానికి ఆ జంట ఎంత బాగుంటుంది. ఏది ఏమయినా మా అరుణ తన అందగాడితో సహా వస్తోంది. తినబోతూ రుచి అడిగినట్లు అతగాడిని గురించిన ఆలోచన లెందుకు. తెల్లవారేసరికి ఎలాగూ రాబోతున్నారుగా. ఇంతలో కూర మాడిపోయిన వాసన ముక్కుకి తగిలి అరుణకు సంబంధించిన కలలోంచి ఉలిక్కిపడి తేరుకుని, వంటింటి వైపు పరుగెత్తాను.

మావారు రాగానే ఈ సంగతి చెప్పి ఉత్తరం చూపించాను. వారు కూడా చాలా ఆనందించారు.

"మామూలు సాదాచీర కట్టుకున్నా మీ అరుణ మీ అందరికన్నా ఎంతో బావుంటుంది" అన్నారు మావారు నా పెళ్ళిలో దానిని చూసి.

"వాళ్ళ నాన్న చాలా సాధారణ కుటుంబీకుడు. ఖరీదుగల చీరలు దాని కెలా





# ఎల్లప్పుడూ చురుకుగా
# ఎల్లప్పుడూ చైతన్యంగా




మీ బిడ్డ పెరుగుతున్నప్పుడు, ఆ బిడ్డ నిరంతరం అదనంగా శక్తి వినియోగించడం జరుగుతుంది.

బూస్ట్‌ను పాలల్లో కలిపితే, రుచికరమైన మాల్ట్ చాకొలెట్ పానీయం తయారౌతుంది. అది మీ బిడ్డకు కావలసిన శక్తిని సమకూరుస్తుంది. ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన మీగడ పాలు, గోధుమ, బారీ మాల్ట్, కోకోలతో తయారైనది.

మీ బిడ్డకు, శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి. అది మీ బిడ్డ రోజంతా, ప్రతి రోజు కూడా చురుగ్గా, చైతన్యవంతంగా ఉండేటట్టు చేస్తుంది.

B 6022 Tel 2

## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం

## బూస్ట్
మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

# మాడిపోయిన కూర

వస్తాయి చెప్పండి" అనేవాడివి బాధగా దానివంక చూసి

మర్నాడుదయమే లేచి యింటిపనంతా చకచకా పూర్తి చేసుకుని, బాయిలర్లో నిప్పు వేసి, కాఫీ, టిఫెన్లు తయారుచేసి, నేను స్నానంచేసి డ్రస్సు చేసుకుని మా వారితో బయలుదేరాను రైలుస్టేషనుకు.

"నీ స్నేహితురాలిమీదున్న ప్రేమలో సగం నామీదున్నా నేనెంతో మురిసిపోయే వాడివి డార్లింగ్" అన్నారు కారు డ్రయివు చేస్తూన్న మా వారు దారిలో.

"చాల్లెండి. ఇప్పుడున్న మురిపెంతోనే ఉక్కిరి బిక్కిరయి పోతున్నా ఇంకా నిందుకు" అన్న నా మాటకు వారు ఫకాలున నవ్వారు ఆ నవ్వులో నేనూ శృతి కలిపాను

"ఏమిటి విశేషం. నీ(కు) అరంగు చీరా అదేరంగు చోళీ వేసుకున్నావు స్పెషలుగా" అన్నారు వారు.

"ఆ రంగంటే మా అరుణకు చాలా ఇష్టం" అంటుండగానే స్టేషను వచ్చేసింది.

కారు ఒక పక్కగా పార్కుచేసి వచ్చారు. ఇద్దరం ప్లాటుఫారం మీది కెళ్ళాం. ఒక పెద్ద క్రికెట్ ప్లేయర్ని రిసీవు చేసుకునే పోజులో నిలబడ్డారు మావారు. రైలు రావడం క్షణం ఆలస్యమయితే యుగం గడిచినంత బాధగా వుంది నాకు. మూడేళ్ల క్రితం నా పెళ్లిలో చూశాను అరుణను.

దూరంగా రైలు రెక్క వంగింది. అంటే అరుణకూ, అరుణ భర్తకూ స్వాగతం యిస్తుందన్నమాట ఆ సిగ్నలు.

రైలు పొగ..

రైలు ఇంజను...

పొడుగాటి రైలు హోరుమని శబ్దం చేసుకుంటూ వచ్చి ప్లాటుఫారంమీద ఆగింది. నా చూపులు ఫస్టుక్లాసు మీదే నిలిచి పోయాయి మావారు ఒక్కొక్క పెట్టెనూ పరికించి చూస్తున్నారు ఇంతలో ఎవరో వెనుకనుంచి నా వీపుమీద ఛెళ్ళుమనిపించారు. వెనక్కి తిరిగి చూశా. మొదటిలో గుర్తు పట్టలేదు గాని తర్వాత నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను.

అది నిజంగా నా అరుణేనా? నా ఊహా సుందరేనా? మూడేళ్ళలో ఎంత పెద్ద మార్పు! తల పండలేదు గాని చూపులకు మాత్రం తలపండిన ముసలమ్మ కంటే అన్యాయంగా మేకప్ అదీ్ను వంటినిండా నగలూ, మధ్యపాపిడి, ముత్తయిదువ ముడి, రూపాయంత కుంకంబొట్టు. వీటన్నిటికీ మించి, పక్కన అరవయ్యేళ్ళ ముసలాయన దగ్గుతూ కనిపించారు.

"ఈమే నా ఫ్రెండు విమల. వీరు దీని భర్తగారు" అని మా యిద్దరినీ ముసలా యనకు పరిచయం చేసింది

"మీ మామగారా... లేక మామగారి తండ్రా" అన్నాను రహస్యంగా అరుణతో.

"కాదు మావారే... మీ ఆయన పెద్ద డాక్టరటగా. చూపిద్దామని తీసుకొచ్చా" అంది నిర్మలంగా చిన్నగా నవ్వుతూ.

నాకు మూర్ఛ వచ్చినంత పనయి కళ్ళు గిరగిర తిరిగాయి. ఆ ప్లాట్ఫారంమీద పడి పోతానేమో ననిపించింది

"అదికాదే—" అని ఏదో అడగబోతున్న నన్ను కనుసౌజ్ఞతోనే వారించి,

"ఏమీ మాట్లాడొద్దు ముందు ఇంటికి పద" అంది ఆజ్ఞాపిస్తున్నట్టు.

దారి పొడుగునా నా కెన్నో - ఎన్నెన్నో ఆలోచనలు మా యింటి ముందు కారు ఎప్పుడాగిందో కూడా నాకు తెలియదు.

ఒంటరిగా చూసి అరుణను అడిగాను "ఏమిటే యిది" అని.

అది మెల్లగా నవ్వి "నాన్న పోయారు తెలుసుగా. కట్నమిచ్చుకునే స్థితిలేక ఒంటరిగావున్న నన్ను వీరు కరుణించి పెళ్ళి చేసుకున్నారు. ఏమే విమలా ఇప్పుడు నేను పదుగురు బిడ్డల తల్లినీ... అయిదులక్షలకు అధిపతినీ! తెలుసా?" అంది.

అంతే! పొయ్యిమీద మాడిపోయిన కూర జ్ఞాపకమొచ్చి అలాగే కూలిపోయా !!

## మనసు

చెడు వున్నప్పుడే మంచికి విలువ !
చీకటి వున్నప్పుడే వెలుతురుకి విలువ !
వేసి వున్నప్పుడే వెన్నెలకి విలువ !
పాపం వున్నప్పుడే పుణ్యానికి విలువ !
పామరుడున్నప్పుడే పండితునికి విలువ !
అన్యాయం వున్నప్పుడే న్యాయానికి విలువ !
కష్టం వున్నప్పుడే సుఖానికి విలువ !
'మనసు' వున్నప్పుడే మనిషికి విలువ ! !

— న్యాయపతి కమలా రాంజీ





"స్వర్ణోత్సవ, సంవత్సరము 1930 - 1980"

# అవీ...ఇవీ...అన్నీ

## ఉదయశ్రీ

కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు తెలుగునాట మూడున్నర దశాబ్దాలుగా పేరు ప్రఖ్యాతులను సంపాదించుకుంటున్న కమ్మని కవి వారి ఖండ కావ్యాలన్నింటినీ లోగడ కొన్ని సంపుటాలుగా ఎన్నో సార్లు వేయడం, వాటికి మంచి ఆదరణ దొరకడం జరిగింది ఇప్పుడే ఉదయశ్రీ అనే 525 పేజీల గ్రంథం మొత్తం కరుణశ్రీ రచనల ఏకైక సమగ్ర సంపుటం— చక్కని గెటప్‌తో దీన్ని తీర్చిదిద్దారు ఇందులో అక్కడక్కడా రేఖా చిత్రాలున్నాయి ముఖ చిత్ర రచనలో బాపూ ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నట్టు గోచరిస్తుంది ఈ ఐదు భాగాల సంపుటాన్ని వెలువరించిన వారు న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, విజయవాడ—2 వెల 40 రూపాయలు.

## అరుణరాగం

శ్రీమతి చెరుకూరి రమాదేవి నవల అరుణరాగం 252 పుటలు మా కార్యాలయం చేరింది. ప్రతులకు న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరు రోడ్, విజయవాడ—2,కి వ్రాయాలి. వెల 12 రూపాయలు.

## పిల్లలు మంచీ - చెడూ

విద్యారంగంలో ఎనలేని కృషి చేస్తూ, వివిధ సామాజిక పదవులలో రాణిస్తూ ఉన్న మాంటిసోరీ మహిళాకళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి డా వి కోటేశ్వరమ్మ తమ అనుభవాన్ని రంగరించి— పిల్లలూ, మంచీ—చెడూ అన్న 137 పుటల పుస్తకాన్ని తయారు చేశారు. దీని వెల ఆరు రూపాయలు బాలి వేసిన ముఖ చిత్రం దీనిలో ఒక ప్రత్యేకత ప్రతులకు జె. బసవేశ్వరరావు, కేరాఫ్ కె బసవయ్య, మూర్తివీధి, విజయవాడ—3కి వ్రాయాలి

## రాగానుబంధాలు

నవల రచన శ్రీమతి వై జి భవాని 232 పేజీలు, వెల రు 11—00లు ప్రచురణ శ్రీ కవితా పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

## ఆమ్రపాలి

పద్య కావ్యము రచన శ్రీ కరుటూరి సత్యనారాయణ 154 పేజీలు, వెల రు 10—00లు ప్రతులకు రచయిత పేర పద్మప్రభాస, వేలూరి వారివీధి, జయకృష్ణపురం, రాజమండ్రి—533104

## మమత

పద్యకావ్యం రచన శ్రీ మహమ్మద్ అలి 106 పేజీలు, వెల 6 రూపాయలు ప్రతులకు మునిస్వర్ పబ్లికేషన్స్, ఖిల్లాలోపల, ఖమ్మం. ●

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





# మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

**రెక్సోనాలో ఉంది సహజ సిద్ధమైన నాలుగు నూనెల సమ్మేళనం—**

హపుషా (దేవదారు జాతి), లవంగ పట్ట లవంగ, నరళం రెక్సోనాతో స్నానం చెయ్యండి—అది మీ చర్మాన్ని మృదువుగా మెరిసేలా ఉంచుతుంది మీరెంతో ఇష్టపడే పరిమళాన్ని చర్మంపై నిలిపి గుబాళింపజేసే రెక్సోనా, మీ చర్మ సంరక్షణ కోసం సహజమైన సాధనం.




# రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్ RX 77 2316 TG

# వారఫలం

## 30 5 1980 శుక్రవారం మొదలు 5 6 1980 గురువారం వరకు

మేషం : మీరు చేసే వ్యాపారంలో అన్ని విధాలా అనుకూలతగల వారం. మీ ఉద్యోగ వృత్తులలో ప్రగతిసూచించేవారం. ద్రవ్యాదాయమున్నది. పాత బాకీలు వసూలు కావటం, ఆరోగ్యం బాగుండటం, వాకచక్యంతో, నిబ్బరంతో వ్యాపార విస్తరణకు ప్రయత్నించడం ఈ వారఫలం. స్త్రీలకు : సకల విధాల యోగ్యమైనవారం. విలువగల వస్తువులు కొనుగోలు చేయగలరు.

వృషభం : మీలో చాలమందికి క్రీడారంగంలో విజయసిద్ధిగలదు. చాల మందికి జాయింటు అనుకూలం. శుక్ర గ్రహానుకూలతగలుగుటచేత కళారంగంలో కావలసినన్ని అనుకూలతలుండ గలవు. పౌరాణికులకు, రచయితలకు, సంగీత పాటకులకు అవకాశములు చిక్కుతాయి. భూలాభం సంభవం. స్త్రీలకు : సర్వత్రా విజయసిద్ధి. ఉద్యోగస్తులకు 'ప్రమోషన్' లభించుట గమనింపతగ్గిన అంశం.

మిథునం : మీ ఆరోగ్యంలో జాగ్రత్త వహించడం ఎంతైనా అవసరం. అపమథ సేన, ఉతపాదులవలన, శాంతింప జేసికొనవచ్చును. ఉత్తరాల మూలాన అనేక విషయాలు మీకు లాభదాయకమైనవి అందగలవు. మీ వృత్తిలో అభివృద్ధి, ఉద్యోగంలో అనుకూలత ఏర్పడగలదు. స్త్రీలకు : వాకవాక్యంలో,పనులలో అనుకూలత సంభవించుటయేగాక ద్రవ్యాదాయంమోద సంభవం.

కర్కాటకం : మీరు చేసే వ్యాపారంలో ఉత్తమ ఫలితాలనందుకొంటారు మీ రచనా వ్యాసంగం ఫలించవచ్చు. మీ బంధువుల మూలాన, మిత్రుల వల్ల అనేక విధాల మీకు ద్రవ్యాదాయమో, ఉపకరింపగల సలహాలనో అందుకొనగలరు. శత్రు వర్గీయులు లొంగుట తటస్థించును. దూరదేశాన్నుండి వ్యాపారానుకూలతతో వార్తలందగలవు. కళా రంగ ఖ్యాతి అతిశయింపగలదు. సభా గౌరవమున్నది. స్త్రీలకు : సభా గౌరవం గలదు.

సింహం : మీ ఆరోగ్యంలో అతి జాగరూకతతో సంచరించదగిన వారం. ఎముక విరిగినవారు, ఉదర శూలతో, రక్తపు పోటుతో, బాధపడగలరు. వీరందు, మాకులకు అధిక వ్యయం సూచితం. చాల మందికి వ్యాపారంలో అనానుకూలత కూడా కన్పించగలదు. పెద్దలతో పరిచయం సంభవం. భూముల విషయాలు మధ్యవర్తి ద్వారా పరిష్కరింపబడుటే మేలని గ్రహించండి. స్త్రీలకు : గృహ కార్యభారం అధికం కావటం, సంతానాన్ని గూర్చిన చిక్కులుండగలవు. జాగ్రత్త వహింపదగిన వారం.

కన్య : స్థిరచరాస్తులమూలాన లాభదాయకం. చాలాకాలంగా నిలిచిన బాకీలు వసూలు కాగలవు. పెద్దల ఆదరణ, మిత్ర సహాయం, ఉద్యోగానుకూలత వృత్తిలో చెప్పదగిన అనుకూల మార్పులు. మాట నేర్పరితనంతో కార్యసాధన, చాలా కాలంగా మీతో వివాదపడిన వారు మళ్ళీ చేరటం, క్రీడా రంగంలో అనుకూలత మధ్యాదిఫలితాలు ఈ వారం సంభవం. స్త్రీలకు : కళా రంగ ఖ్యాతి, ఉద్యోగ వృత్తులలో అనుకూలత, సంఘంలో గుర్తింపు సంభవం.

తుల : ధనాదాయమున్నది. శ్రద్ధాసక్తులతో వ్యవహరించితే మీ వ్యాపారం విస్తరించే మార్గమున్నది. వ్యాపార నిమిత్తం క్రొత్త వస్తువులు కొనుగోలు చేయగలరు. అయినవారితో మాట పట్టింపులుండగలవు. మీ పై అధికారులతో జాగ్రత్తగా వ్యవహరించడం ఎంతైనా అవసరం. ఆరోగ్య లోపముండదు. స్త్రీలకు : ఆదాయం, ఆనందం, సత్కాలక్షేపం, కార్యానుకూలతగల వారం.

వృశ్చికం : మీరు చేసే వ్యాపారంలో లోపం లేదు. జాయింటు వ్యాపారస్తులు మాత్రం ఇబ్బందులు, వివాదాలు, అధికారులవలన బెడద రాకుండా చూచుకోవాలి. మాటకు విలువ హెచ్చుతుంది. క్రీడా రంగంలో అనుకూలత చాల మందికి చెప్పదగినవారం. శుభ కార్యాన్ని గూర్చిన ఆలోచనలుండగలవు. అవి త్వరలోనే ఫలింపనున్నవి. పోయిన వస్తువులు దొరకవచ్చు. స్త్రీలకు : గృహంలో ఆనందం, ఆదాయం, ఖ్యాతి, గౌరవం సంభవించే వారం.

ధనస్సు : చాల కాలంగా విలువగల వస్తు వాహనాలు కొనాలనే మీ ప్రయత్నం ఈ వారం ఫలవంతం. ముఖ్య బంధువులు మళ్ళీ చేరుతారు. ఒకవేళ వారు మీ సహాయం అర్థింపవచ్చు. సంఘంలో మీకు పలుకుబడి హెచ్చుతుంది. సభాగౌరవం సంభవించగలదు. పుణ్య కార్యాలను గూర్చి, సంతాన విషయంలో, శుభ కార్యాలనుగూర్చి మీరుచేసే ప్రయత్నాలు త్వరలో ఫలింపనున్నవి. అందులకు ఈ వారం నాందీ ప్రస్తావన జరుగుతుంది. స్త్రీలకు : ఉద్యోగానుకూలతగల వారం.

మకరం : ఆరోగ్య లోపం కనిపిస్తుంది. వ్యాపారంలో ఇబ్బంది లేదు. భూమియో, గృహమో కొనే ప్రయత్నం చేయగలరు. వాహన ప్రమాదముండగలదేమో! జాగ్రత్త! రాశికి అష్టమస్థానంలోని గ్రహాలు కొంత ఇబ్బందిని కలుగజేయనున్నవి. మిత్రులతో ఘర్షణ సంభవం కావచ్చు. స్త్రీలకు : ఆదాయం, వృత్తిలో అభివృద్ధి, ఉద్యోగంలో వృద్ధి, కళా రంగంలో ప్రగతిగల వారం.

కుంభం: గత కొన్నివారాలుగా వ్యాపారంలో అనుకూలతలేదు గదా! భారీ వ్యాపార స్తంభనను గూర్చి చికాకులున్నాయిగదా! వాని విషయంలో అనుకూలత ప్రాప్తించుటలో ఆశ్చర్యంలేదు. కృషి చేయండి. అనుకూలతగలదు. భూ విస్తరణ కార్యక్రమం, గృహాన్ని పెంపు చేసే ఆలోచనలుండగలవు. క్రీడా రంగంలో ఉత్సాహవంతులకు అనుకూలత గలదు. స్త్రీలకు సర్వత్రా విజయం.

మీనం : చాల మంది, మీ మిత్రులు కానివ్వండి, బంధువులు కానివ్వండి, మిమ్మల్ని నిర్మొగమాటస్తులుగా గుర్తిస్తారు. మాటతీర్లో నిలకడ, మృదుత్వం అవసరం. విషయాలు గ్రహింపనందున, ఈ వారంలో, మీ వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో ఆశించిన ఫలితాలుండకపోవచ్చు. విలాసవస్తు సేకరణకు ప్రయత్నిస్తారు. స్త్రీలకు: ఆదరణగలదు. ద్రవ్యాదాయమున్నది. సభా గౌరవం సమకూరుతుంది.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి








# రికరి®
# ఇన్‌స్టెంట్




'ఇది ఫిల్టర్
కాఫీ వలెనే యెంతో
రుచిగా ఉంటుంది కాబట్టి
తేడాచెప్పడం చాలాకష్టం.

నేన్ కఫే ఉత్పత్తిదార్లనుండి-ప్రపంచమంతటా కాఫీ శ్రేష్టత తెలిసినవారు

SAA/FSL/R/1135



ఏప్రిల్ 30 వ తేదీన నల్గొండలో నాగార్జున గ్రామీణ బ్యాంకు నాల్గవ వార్షికోత్సవాలను ప్రారంభిస్తున్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా హైదరాబాద్ సర్కిల్ చీఫ్ జనరల్ మేనేజర్ శ్రీ ఎస్. కె. నాథన్. నాగార్జున గ్రామీణ బ్యాంకు ఛైర్మన్ శ్రీ వై. వి. ఎస్. మూర్తిని పై చిత్రంలో చూడవచ్చును

## హైదరాబాద్ నోట్ బుక్

(49 వ పేజీ తరువాయి)

**మురికి వాడలలో గృహాలు:**

జంట నగరాలలో 455 మురికి వాడలున్నాయి. వాటి జనాభా నాలుగు లక్షల ఇరవై వేలు. వీటిలో 6,200 రూపాయల వ్యయంతో కుటుంబానికొక ఇంటిని నిర్మించాలని ప్రభుత్వం సంకల్పించింది. 27 మురికివాడలలో 3479 ఇళ్ళు, 15 మురికి వాడలలో 1500 ఇళ్ళు నిర్మించడానికి త్వరలో ప్రయత్నాలు జరుగుతాయి. ఈ గృహ నిర్మాణమే కాక మురికివాడల వారికి వివిధ వృత్తులలో శిక్షణకు ఏర్పాట్లు జరుగుతాయి. 156 బాల్‌వాడీలు నెలకొల్పుతారు. వీటికి రాష్ట్ర ప్రభుత్వం, ఐక్యరాజ్య సమితి ఆర్థిక సంఘం ఆర్థిక సహాయం చేస్తాయి. ఈ సమాచారాన్ని పట్టణ ప్రాంతాభివృద్ధి పర్యవేక్షక విభాగం డైరెక్టర్ శ్రీ టి. రాజగోపాలాచార్య ఏప్రిల్ 27న పత్రికా ప్రతినిధులకు తెలియజేశారు.

**ఇలా కన్ను మూస్తానో!:**

ఏప్రిల్ 27న భారతీయ జనతాపార్టీ రాష్ట్రీయ సదస్సులో విఖ్యాత రచయిత, పత్రికా రచయిత శ్రీ నార్ల వెంకటేశ్వరరావు ప్రసంగిస్తూ "బ్రిటిష్ బానిసగా జన్మించిన నేను నెహ్రూ కుటుంబ బానిసగా కన్ను మూయవలసి వస్తుందేమో!" అని ఆవేదన వ్యక్తం చేశారు. "నాకు డెబ్బయి ఏళ్ళు దాటాయి. ఇంక ఎక్కువ కాలం జీవించలేను. స్వాతంత్ర్యం ఉన్న దేశంలో మరణిస్తే బాగుండును!" అని ఆయన అన్నారు. స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం ఎడల విశ్వాసమున్న యువకులు ఈ దేశంలో నియంతృత్వం ఏర్పడకుండా దీక్ష వహించాలని ఆయన ఉద్బోధించారు.

ఈ సదస్సును భారతీయ జనతా పార్టీ కార్యదర్శి శ్రీ సికిందర్ భక్త్ ప్రారంభించారు. ఆహ్వాన సంఘ అధ్యక్షుడు, విధాన సభ మాజీ సభ్యుడు శ్రీ సయ్యద్ హుసేన్ సదస్సుకు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు లాల్‌కృష్ణ అద్వానీ, వెంకయ్యనాయుడు, సి. జంగారెడ్డి, జూపూడి యజ్ఞనారాయణ, వి. రామారావు, డి. సూర్యప్రకాశరెడ్డి, చలపతిరావు, శ్రీమతి కుముద్ నాయక్ మున్నగువారు ప్రసంగించారు. భారతీయ జనతా పార్టీ ఒక్కటే ప్రత్యామ్నాయ జాతీయ పక్షంగా రూపొంది ప్రజల ఆకాంక్షలు తీర్చగల రాజకీయ పక్షమని తీర్మానించారు. వివేకవర్ధిని కళాశాల ఆవరణలో తెన్నేటి విశ్వనాథం నగర్ పేర ఏర్పాటుచేసిన సభాంగణంలో ఈ సదస్సు జరిగింది. నాటి సాయంకాలం జరిగిన బహిరంగ సభలో శ్రీ అద్వానీ మున్నగు భారతీయ జనతా పార్టీ నాయకులు భారతీయ జనతా పార్టీ ఉద్దేశాలను వివరించారు.

**ఉపశ్రుతి:**

బాబారా! భారతీయ జనతా పార్టీ రాష్ట్ర సదస్సు స్థలికి "తెన్నేటి విశ్వనాథం నగర్" అని పేరు పెట్టి ఎంతగా విశ్వనాథంగారిని గౌరవించారో! — అన్నారు ఒక విశ్వనాథభక్తులు. ఆ! నిజమే. తద్దినాలు పెట్టడంలో మన వారు అందె వేసిన చేయి — అన్నారు మరొకరు

—తిరుమల రామచంద్ర

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

# చూడండి...
# సర్వోత్తమ తెలుపుకోసం రానిపాల్®

బట్టలను ఆఖరుసారి జాడించునపుడు కొంచెము రానిపాల్ వేయండి. అపుడు చూడండి...
బట్టలపై మెరిసే తెలుపు! రానిపాల్ తెలుపు! తెల్లటి బట్టలు ఏవైనా కాని—
నూలు, సింథెటిక్ మరియు మిశ్రమ బట్టలు రానిపాల్‌తో మెరుస్తూ వుంటాయి.

**నియమానుసారంగా రానిపాల్‌ను వేయండి...తెలుపు చూడండి, చూపండి!**

**నూలు దుస్తులకు రానిపాల్®**
**సింథెటిక్ మరియు మిశ్రమ దుస్తులకు రానిపాల్®-ఎస్.**







Shilpi SG-2A/78 Tel




యువతరాల చిందుల విందుల
గోల్డ్‌స్పాటర్ మీరే...
ఇక ఆనందించండి గోల్డ్‌స్పాటింగ్.

Don't
think...
just
Goldspot

what's
biting
him?






ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ!
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాలచిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్సిన ముచ్చటైన
మురిపపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.

గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా ...మజా యే మజా!

RYA-GS 1-80-TEL